*Issued on 7— 3—1957*







# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

## OFFICIAL REPORT

*THURSDAY, the 5th APRIL, 1956.*

VOLUME VII — No. 4.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Thursday, the 5th April* 1956.

The House met in the Assembly Hall, Kurnool at half past eight of the clock, Mr. Speaker (Hon Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS.

*Opening of an Engineering College in Tirupathi.*

718—

* 1218 Q.—SRI P. GOPALU REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state :

(a) whether Government propose to open an Engineering College in Tirupathi this year ; and

(b) if not, why ?

THE HON. DR. B. GOPALA REDDI :—

(a) The answer is in the negative

(b) There is no necessity for a fourth Engineering College in the State for the present. Besides the Engineering Personnel Committee appointed by the Planning Commission has not recommended the establishment of new Engineering Colleges for the Southern Region comprising Madras, Andhra Mysore, Travancore—Cochin, Hyderabad and Coorg.

SRI P. GOPALU REDDI :—ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో Polytechnic Schools పెడతామని అన్నారు. అవైనా పెట్టడానికి ఆలోచిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అది వేరే విషయము. ఇప్పుడు Engineering కళాశాల విషయము మాట్లాడుతున్నాము.

[5th April 1956

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడు దాని యొక్క అవసరం లేదంటున్నారు. ఇప్పుడు మన ఆంధ్ర దేశములో గాని, భారత దేశము మొత్తంమీద గాని, తయారయ్యేటటువంటి Engineers మనకు ఇపుడు planning కు development కు అవసరమైనంతమంది ఉన్నారని మంత్రిగారి ఉద్దేశమా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఇప్పుడు ఒక Technical Education Committee ఉన్నది. మన ఇండియాలో ఈ Second Five Year Plan అమలు జరగడానికొరకు ఎంతమంది Engineers కావాలి, అనేటటువంటిది లెక్క వేసుకొని, మన Southern Region లో, ఇప్పుడు ఉన్నదానికన్నా ఎక్కువ Engineering కళాశాలలు అక్కరలేదని చెప్పుతున్నారు. అసలు Waltair లో ఈ సంవత్సరం పెట్టేటటువంటి మూడవ Engineering కళాశాలకే ఇంకా కొంచె తగరారు ఉన్నది. అందువల్ల ఇప్పుడు నాలుగవది పెట్టడమనేది ఉదయించదు.

SRI T. JALAYYA :—ఇరవైఒక్క ఎకరాల భూమి, రెండు లక్షల రూపాయలు గుంటూరులో ఇస్తాము, అక్కడ మాకు ఒక Engineering కళాశాల పెడతారా ?

THE HON. DR. B GOPALA REDDI :—ఇంతకుముందు గుంటూరులో జాలయ్య మొదలైనవారు Women's College కోసం చేసిన వాగ్దానాలు జ్ఞాపకమున్నాయి అవి ఎంతవరకు పూర్తి అయినాయో కూడా జ్ఞాపకమున్నది.

SRI T. JALAYYA :—మా వాగ్దానాలు మేము చెల్లించుకొన్నాము. గవర్నమెంటు వాగ్దానమే ఇంకా నిలిచిఉన్నదని నా ఉద్దేశము.

THE HON. DR. B. GOPALA REDDI :—బహుశా అదివాస్తవం కాదేమో అనుకుంటాను. Women's College Hostel కోసంగా వారి వాగ్దానం పూర్తిగా నిర్వహించలేదు. అది అసంపూర్తిగానే గవర్నమెంటుకు వదలివేశారు. తరువాత గవర్నమెంటువారే పూర్తిచేయవలసి వచ్చింది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇప్పుడు Planning Commission report గాని, ఈ Second Five Year Plan గాని చూస్తే మనకు Engineers కొరత ఉన్నట్లు ఖచ్చితముగా బోధపడుతుంది. అందువల్ల, మళ్ళీ Technical Advisory Committee లో దీని అవసరాన్ని గుర్తించేటట్లు చేస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—మన కేమైనా కొరత ఉంటే, Supervisors, Subordinate Staff లో ఉన్నది. గాని Graduate Personnel లో లేదు. ఆ రెంటికి వాళ్లు distinction చేస్తున్నారు. అందువల్ల ఆ కమిటివాళ్లు దీన్ని తిరిగి ఆలోచించే Southern Region లో ఇంకా ఎక్కువ colleges అవసరంలేదనేమాట చెప్పడం జరిగింది. అందుకనే waltair college విషయంలో కొంత తగరారు ఉన్నదని చెప్పుచున్నాను.

SRI S. VEMAYYA :—Southern Region అని అంటున్నారు. అంటే ఏమైనా regions ఏర్పాటుచేసి ఆ ప్రకారంగా college open చేసే దానికి ఏమైనా ప్రాతిపదిక ఉన్నాదా ?

THE HON. DR. B. GOPALA REDDI :—మద్రాసు, మైసూరు, తిరువాన్కూర్-కొచ్చిన్, మన ఆంధ్ర, ఇవన్ని తీసికొని, ఇక్కడ ఎన్ని Engineering కళాశాలలు ఉన్నాయి, ఎంతమంది Graduates ప్రతి సంవత్సరం తయారవుతున్నారు, ఇవన్నీ లెక్కవేసుకొని, ఈ 5 సంవత్సరములకు మన development works కు కావలసినంతమందికంటె, ఇంకా ఎక్కువ Graduate personnel ఉన్నదనేటటువంటి అభిప్రాయము వాళ్లు చెప్పడం తటస్థించింది. కాబట్టి మనకు కావలసింది subordinate staff మాత్రమే.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ Southern Region లో ఎన్ని Engineering Colleges ఉన్నాయో తెలవిస్తారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—మద్రాసు రాష్ట్రంలో చాలా ఉన్నాయి. కోయంబత్తూరులో 2, కారైకుడిలో 1, అన్నామలైనగర్ లో 1, మద్రాసులో 1, తరువాత మైసూరులో 3, తిరువాన్కూరు-కొచ్చిన్ లో మొన్ననే ఒకటి పెట్టినారు. మన ఆంధ్రలో 3 ఉన్నాయి. కాబట్టి మనకు కావలసినటువంటి కళాశాలలు ఎక్కువగానే వున్నాయి.

*Repairs to the Jaffar Sahib Channel in Nellore District.*

719—

* 906 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether there are any proposals with the Government to repair the Jaffar Sahib Channel in Nellore District ; and

(b) if not, the reasons for the delay ?

THE HON. SRI N SANJEEVAREDDI .—

(a) Requisite repairs are being carried out annually. It is proposed to remodel this channel and other channels in the Pennar system

(b) Does not arise.

SRI S. VEMAYYA :—What is the nature of the re-modelling, Sir,

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు కావలసినంత వరకు డబ్బు ఖర్చు పెడుతున్నాము అని చెప్పాను. What is the nature of the re-modelling, అంటె, తూములు పెంచడానికి, extended areas కు తగినంత నీటిని సరఫరా చేయడానికి కావలసిన కార్యక్రమము.

*Appointment of Harijans as stamp vendors in the Registration Department.*

720—

* 580 Q.—SRI M. RAJARAM .—Will the Hon. the Minister for Revenue be pleased to state .

(a) whether the Government will be pleased to place on the Table of the House the G O. authorising the appointment of Harijans as stamp vendors in the Registration Department ;

(b) if so, the number of Harijans appointed as stamp vendors in the State ; and

(c) the number of such vendors in Anantapur District ?

THE HON. SRI K. CHANDRAMOULI .—

(a) There are no stamp vendors at all in the Registration Department and the Member obviously refers to such appointments in the Revenue Department. Under the rules, any private person may be appointed as stamp vendor in the Revenue Department. There is no special G. O authorising the appointment of Harijans as stamp vendors.

5th April 1956]

(b) There are 5 Harijan stamp vendors in the State.

(c) There are no Harijan stamp vendors in the Anantapur District.

SRI M. RAJARAM :—G.O. లేదన్నారు. లేకపోయినప్పటికీ, అర్జీలు వ్రాసుకున్నటువంటి వారికైనా ఇచ్చేటట్లు ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పటికీకూడ ఇస్తూనే ఉన్నారు. అటువంటి వాళ్లు ఉంటె ఇవ్వడానికి ప్రయత్నం చేస్తాము.

SRI R. B. RAMAKRISHNA RAJU :—ఈ stamp vendors కు కులభేధాలు ఏమైనా ఉన్నాయా ? హరిజనులు ఉండకూడదని నిబంధనలేమైనా ఉన్నవా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కులాలవారిగా stamp vendors ను నియమించడంలేదు. అటువంటి G.O. ఏమీలేదని ఇదివరకే చెప్పాము.

SRI N. K. LINGAM :—ఈ రాష్ట్రంలో 5 మంది హరిజనులే stamp vendors గా వున్నారని మంత్రిగారు సెలవిచ్చారు. ఇందులో ఆర్థికమనేది చాలా ముఖ్యమైనటువంటి విషయము. ఎక్కువమంది హరిజనులను stamp vendors గా appoint చేస్తే, వారి బాధలు, అంటరానితనం పోతుంది గనుక ఒక special G.O. పెట్టి ప్రతి తాలూకాకు ఇద్దరు హరిజనులనైనా appoint చేయడానికి ఆంధ్ర ప్రభుత్వం ఏమైనా పూనుకొంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—అటువంటిదేమీ ఇప్పుడు ఆలోచించడం లేదండి.

SRI S. VEMAYYA :—ప్రస్తుతము వున్నటువంటి అయిదు stamp vendors ఏఏ ప్రదేశాలలో వున్నారో తెలియజేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ముగ్గురు గుంటూరు జిల్లాలోను, ఒకరు కర్నూలు జిల్లాలోను, ఇంకొకరు నెల్లూరు జిల్లాలోను ఉన్నారు.

SRI M. NAGI REDDI :—ఈ stamp vendors పనిని ఏ private వ్యక్తులకో ఇచ్చే దానికంటె పంచాయితీ బోర్డులకు ఆదాయము తగ్గిస్తున్నారు గనుక వాటికి ఇచ్చినట్లయితే సరిపోతుంది. కనుక పంచాయితీ బోర్డులకు ఈ పని ఇవ్వడానికి ఆలోచిస్తారా ? దీనివల్ల ఇంకొక ఉపయోగముకూడ వున్నదనేది ప్రభుత్వ దృష్టికి తీసుకొనివస్తున్నాను. మామూలుగా ఈ Stamp vendors Taluk

headquarters లో వుంటారు గనుక, register కు పోయేముందు stamps కొరకు ఒకసారి తాలూకా headquarters కు పోవడం మరల వచ్చి మరల head quarters కు పోవడం ఇదంతా గ్రామాలలో ప్రజలకు ఇబ్బందిగా వుంటుంది. కాబట్టి పంచాయితీలకే ఇచ్చినట్లయితే, గ్రామాలలో వుండే ప్రజలకు అందుబాటులో వుంటుంది.

THE HON. SRI K. CHANDRAMOULI :— ఈ Registration fees వీటిలో కొంత భాగము ఎట్లాగూ పంచాయితీ బోర్డులకు ఇస్తున్నాము ఇది ప్రత్యేకంగా కొంతమంది వ్యక్తులు అమ్ముకొనేది కాబట్టి, ఇది పంచాయితీలకే ఇవ్వాలని ఏమీ లేదు.

*Representations from the Trust Board of Sri Subrahmanyeswara swamy Devasthanam, Tiruttani.*

721—

*1214 Q.—SRI P GOPALU REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether Government have received representations from the Trust Board of Sri Subrahmanyeswaraswamy Devasthanam, Tiruttani regarding an amendment of section 38 of the Zamindari Estates Abolition Act ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

The proposal is under examination in consultation with the Board of Revenue.

SRI R. B. RAMAKRISHNA RAJU:— ఈ విషయము చాలా కాలముగా పరిశీలనలో ఉన్నది. Revenue Board నుంచి ప్రభుత్వానికి ఇంకా రిపోర్టు రాలేదని వింటున్నాను. అయితే అది ఎప్పుడు వస్తుందో చెబుతారా?

THE HON. SRI K. CHANDRAMOULI :— ఈ రిపోర్టుకోసము reminders కూడ పంపించాము. సాధ్యమైనంతత్వరలోనే వస్తుందనుకొంటాను. ఇందులో జిల్లాలనుంచి information రావలసియున్నది. అందువల్లనే కొంచెము ఆలస్యమవుతున్నదనుకొంటాను. రిపోర్టును సాధ్యమైనంతత్వరలో రప్పించటానికి ప్రయత్నము జరుగుచున్నది.

5th April 1956]

SRI R. B. RAMAKRISHNA RAJU :—వచ్చే అక్టోబరులోపలనైనా వస్తుందా? ఎందుకంటే, అక్టోబరు తరువాత మనరాష్ట్రము యింకా పెద్దది అవుతుంది. అప్పుడు యీ రిపోర్టును గురించి complications రావచ్చును.

THE HON. SRI K. CHANDRAMOULI :—సాధ్యమైనంతత్వరలో నే రిపోర్టును తెప్పించటానికి ప్రయత్నిస్తాము. వచ్చే శాసనసభ సమావేశములో ప్రవేశ పెట్టటానికి ప్రయత్నిస్తాము.

SRI S. VEMAYYA :—ఈ దరఖాస్తు ప్రభుత్వానికి చేరిందని అన్నారు. అయితే, అది ప్రభుత్వానికి ఎప్పుడు అందింది? దాన్ని ఎప్పుడు పరిష్కారము చేస్తారు?

THE HON. SRI K. CHANDRAMOULI :—దీనినిగురించి మొదట్లో కొంత representation ఉండడమే కాకుండా, రామకృష్ణరాజుగారు దానికి ఒక motion కూడ తీసుకునివచ్చారు. ఆ సంగతి యీ సభకు తెలుసును. దానిని ప్రభుత్వము favourable గా ఆలోచించి, పాల్గొంటుందని అంటున్నాను. కాని దానికి అవసరమైన information కావలసి ఉన్నది. ఇది finance కు సంబంధించిన వ్యవహారము కాబట్టి ఎక్కువగా information కావలసి ఉన్నది. ఇవి అంతా జరగటానికి కొంత కాలయాపన జరుగుతున్నప్పటికినీ ప్రభుత్వము వీలు అయినంతత్వరలో తీసుకునిరావటానికి ప్రయత్నిస్తున్నది.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ప్రభుత్వానికి ఎప్పుడు వచ్చిందని అడిగితే, దానికి సమాధానము చెప్పకుండా మంత్రిగారు యింకా ఏదేదో చెప్పారు. అది ఎప్పుడు వచ్చిందో, దానిని ఎప్పుడు పరిష్కరిస్తారో తెలియజేయడానికి సమాధానముకావాలని అంటున్నాను

THE HON. SRI K. CHANDRAMOULI:—ఆ information యిప్పుడు నావద్దలేదు. వేరేప్రశ్న వేస్తే చెబుతాను.

*District Planning and Development Committee, Krishna.*

722—

*868 Q.—SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

whether the District Collector, Krishna has co-opted any member into the District Planning and Development

[5th April 1956

Committee, Krishna, without the previous approval of the said Planning Committee , and if so, why ?

THE HON. SRI D. SANJIVAYYA :—

"Yes Sir. The Government issued instructions that Co-operative movement should also be represented at the District Planning and Development Committee. The President of the Central Co-operative Bank, Vijayawada who was recommended by the Deputy Registrar of Co-operative Societies, Vijayawada was co-opted on the District Planning and Development Committee, Krishna by the Collector of Krishna in March 1955. As the nomination does not seem to have been placed before the committee for its acceptance, the Collector of Krishna has been asked to place it before the District Planning and Development Committee.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, Planning and Development Committeeను form చేసినసందర్భములో, కలెక్టర్ల అభిప్రాయాలన్నీ కమిటీముందు పెట్టాలని ఉన్నది. దీనికి విరుద్ధముగా కమిటీకి తెలియకుండా కలెక్టరుగారు ఒకరిని మెంబరుగా co-opt చేసుకున్నారు. దానిని యిప్పుడు కమిటీ ముందుపెట్టి, ratify చేయవలసిన అవసరము ఏర్పడింది. ఇది జరిగి ఎంతోకాలము అయినప్పటికినీ, కమిటీ ముందుకురానీయకుండా, కలెక్టరుగారు ఎందుకు evade చేస్తూ వస్తున్నారు? కమిటీముందు యింతకాలము ఎందుకుపెట్టలేదో తెలియజేస్తారా?

THE HON SRI D. SANJIVAYYA :—ఈ కమిటీలో దాదాపు 14 మంది మెంబర్లను co-opt చేసుకోవడమయింది. ఈ 14 మందినిగురించి కమిటీ ముందు పెట్టారు. కమిటీవారి approval తీసుకున్నారు. సభ్యుడు అడిగిన ప్రశ్న సందర్భములో 1955 వ మార్చి నెలలో Co-operative movement ను గురించి representative కమిటీలో ఉండాలనే ఉద్దేశ్యముతో కలెక్టరు ఒకరిని co-opt చేసుకున్నారు. అందుకు ఎవరూ object చేయలేదు. అందువల్ల ఆ విషయము అట్లాగే ఉండిపోయింది. ఇప్పుడు ఎవరైనా అభ్యంతరముపెట్టితే, అది తప్పకుండా కమిటీ ముందు పెట్టవలసిందని, కమిటీ approval పొందవలసిందని ప్రభుత్వం instructions పంపడము జరిగింది.

SRI G. NAGI REDDI :—District Planning Committee లకు యిదివరకు మెంబర్లుగా వేసినవారిపేర్లను రద్దుచేశారని, మరల మెంబర్లను చేర్చుటానికి co-option ద్వారానో, లేక election ద్వారానో జరుగుతుందని

అనుకుంటున్నారు. కలెక్టర్లకు ప్రభుత్వము ఆ విధముగా చేయమని ఉత్తరువులు పంపించారని అంటున్నారు. ఇది నిజమేనా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అటువంటిది ఏమీ లేదండి.

SRI N C. SESHADRI :—District Planning Committee meeting కు శాసనసభ్యులు attend అయినప్పుడు వారికియిచ్చే T. A. లకు ఒక్కొక్క జిల్లాలో ఒక్కొక్క విధముగా రూల్సు apply చేస్తూ యిస్తున్నారన్న సంగతి మంత్రిగారికి తెలుసునా ?

THE HON. SRI D. SANJIVAYYA —ఆ విషయము నాకు తెలియదు. కాని T. A. Rules అందరికీ ఒకేవిధముగా అన్వయింపబడతాయి.

SRI L. LAKSHMANA DAS: —అధ్యక్షా, ఈ జిల్లాప్లానింగు కమిటీలు ప్రథమ పంచవర్ష ప్రణాళిక సమయములో ఏర్పాటు చేయబడినవి. అయితే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోగూడ యివే కమిటీలు ఉంటవా ? లేకపోతే ఏవైనా మార్పు చేస్తూ క్రొత్త కమిటీలను ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA —అవే కమిటీలు ఉంటవి. ఇందులో M. L. A. లు అనిఉన్నది. తరువాత Parliament Members, Municipal Chairmen అనికూడ ఉన్నది. వీరిలో ఏవైనా మార్పులువచ్చి, క్రొత్తవారు ఎన్నికఅయితే, ఓడిపోయినవారి స్థానములలో, ఎన్నికఅయినవారు automatic గా వస్తారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA —కలెక్టరు ఎవరినైనా co-opt చేసుకుంటే, ఆయనను committee వారు ఆమోదించినదాకా ఆయన మెంబరుక్రిందకురాడు అని ఉన్నది. అలాంటప్పుడు యిప్పుడు కలెక్టరు nominate చేసినంతమాత్రాన, కమిటీ ఆమోదము లేకుండానే, ఆయన మెంబరుగా వ్యవహరిస్తున్నాడా ?

MR. SPEAKER .—That is the question which is now under consideration.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, నా ప్రశ్న అదికాదు కలెక్టరు ఒకరిని మెంబరుగా co-opt చేసుకున్నాడు. దానికి ఆయన కమిటీ approval తీసుకోలేదు. కమిటీ approval పొందటానికి ఆలోచిస్తున్నామని అంటున్నారు.

MR. SPEAKER :—Co-option means approval by the Committee , nobody else can do it.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అది కాదండి. కమిటీ ఎదుట పెట్టి, వారి approval పొందకుండా, ఎవరినో కలెక్టరు ముందుగా co-opt చేసుకున్నాడు. ఇంతవరకు కమిటీ approval కాలేదు. ఇప్పుడు దానికి అభ్యంతరమువచ్చింది గనుక కమిటీముందు పెట్టతామని అంటున్నారు. అయితే కమిటీ approval వరకూ ఆయన మెంబరు అవునా కాదా ? ఆయన మీటింగుకు అందరితోబాటు హాజరుఅవుతున్నాడా, లేదా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఆయన సభ్యుడుగానే హాజరవుతున్నాడు ఆయనను co-opt చేసుకోవడముఅంటే, కమిటీముందు పెట్టి, కమిటీవారి approval కూడ తీసుకోవడం జరుగుతుంది. అయితే కమిటీముందు పెట్టి, approval పొందిన తరువాతనే ఆయన హాజరుకావటానికి అవకాశము ఉంటుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఇక్కడ ఒక technical point ఉన్నది. ఎవరినైనా co-opt చేసుకునేటప్పుడు, కమిటీవారు approve చేసిన తరువాతనే ఆయన regular member గా వస్తాడు. అటువంటి సందర్భములో ఆయనను co-opt చేసుకున్నట్లుగా resolution pass చేయకముందే, ఆయనను co-opt చేసుకున్నట్లుగా కలెక్టరు చెప్పాడు.

MR SPEAKER .—I understand the Hon. Minister having said that it was done by mistake, and that when the mistake was pointed out, it is being rectified. Why all this now ?

THE HON. SRI D. SANJIVAYYA .—Probably the member has not heard my answer, Sir.

" As the nomination does not seem to have been placed before the committee for its acceptance, the Collector of Krishna has been asked to place it before the District Planning and Development Committee."

SRI S. VEMAYYA :—ఒకరిని మెంబరుగా co-pt చేసుకోవడములో కమిటీముందు పెట్టకుండానే వేశారనేది, తప్పు జరిగిందని అంటున్నారు. అలాంటప్పుడు యిటువంటి తప్పులు యిక ముందైనా జరగకుండా ప్రభుత్వంచూస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—దాని అర్థము అదేనండి. "Collector has been asked to place the matter befor the committee అంటే" " In future it should not happen " అన్నమాట.

SRI G YELLAMANDA REDDI :—అధ్యక్షా, మంత్రిగారు సమాధానము చెబుతూ కలెక్టరు nominate చేసినతరువాత అది కమిటీ ముందు పెట్టలేదని చెప్పారు. అసలు యీ method సరియైనదికాదు. ఎందుకంటే, ఒక resolution ద్వారా కమిటీ ఎవరినైనా co-opt చేసుకోవలని ఉన్నది. కమిటీ existence లో ఉన్నప్పుడు కలెక్టరుకు అది పెట్టి కమిటీ approval పొందలేదని చెబుతున్నారు. ఆ విధముగా చేయడములో the Collector has no voice at all. అసలు కలెక్టరు అంత తొందరపడి చేయవలసిన అవసరము ఏమి వచ్చింది? దీనినిబట్టి ప్రభుత్వమే సూచన యిచ్చినట్లున్నది. కమిటీకి తెలియపరచకుండా ప్రభుత్వము అంత తొందరగా సూచన చేయవలసిన అవసరము ఏమి వచ్చింది? ఇక ముందైనా అట్లు చేయకుండా చూస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA :—కమిటీలో Co-operative movement ను represent చేయటానికి ఒక మెంబరు ఉండవలసియున్నది. అందుకోసము District Central Bank President ను co-opt చేయడము మంచిదని ప్రభుత్వం అనుకున్నది. కాబట్టి ప్రభుత్వము వారి పేరును propose చేసింది. ఏ విధమైన objection లేకుండా మెంబర్లు ఉంటే, అది వారు ఒప్పుకున్నట్లేకదా? అది co-option అన్నమాటే. అంతకంటె వేరే co-option ఏమి కావాలి? ఎవరైనా ఒకరిపేరు suggest చేయకుండా, ఊరకనే పేరు ఎట్లా ఉత్పన్నము కాగలదు? So the Collector suggested his name and that will be approved by the Committee.

SRI V. KURMAYYA :—అధ్యక్షా, అసలు G.O. లోనే "స్త్రీల తరఫున, హరిజనుల తరఫున, సంస్థల తరఫున" అని ఉన్నది. అందువల్ల Central Bank President గారిని గురించి చాలామంది non-official members కలెక్టరుగారితో చెప్పడమువల్ల ఆ విధముగా జరిగింది. రేపు కమిటీ సమావేశమైనప్పుడు, అది ratify అవుతుంది కాబట్టి, యీ విషయములో సభ్యులు పెద్ద గందరగోళము చేయవలసిన పనిలేదని అనుకుంటాను.

[5th April 1956

*Development of rural areas.*

723—

* 1060 Q —SRI N. C. SESHADRI —Will the Hon the Minister for Planning and Industries be pleased to state ·

(a) whether any sum is set apart in our State's Second Plan for development of rural areas apart from the National Extension Service programme ,

(b) if so, the amount set apart ; and

(c) the manner in which it is proposed to be spent ?

THE HON. SRI D. SANJIVAYYA .—

(a) Besides the National Extension Service programme, the Centre will allot to this State from Central grant some amount to be spent on Local Development works which will benefit the rural areas. In the Revised Second Five Year Plan of the State for Rs 125·10 crores a sum of Rs 175 lakhs was specifically earmarked for village schemes. But with the reduction of the outlay in the State plan to Rs 116 2 crores, it was to be decided what portion of the plan provision should be earmarked specifically for rural areas. The District plans which will be prepared from the various sector plans of the Heads of Departments will contain certain schemes which will benefit the villages.

(b) The Government of India have since allotted a grant of Rs. 28·35 lakhs for 1956-57 under Local Development Works. No figures are yet ready to indicate schemes which will benefit rural areas from out of the schemes included in the State Plan.

(c) The procedure obtained for Local Development Works at present will normally operate in respect of the future Local Development Works also unless the Government of India indicate any change in procedure. The procedure for other schemes in the State plan which will benefit the rural areas is under examination.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, 1956-57 వ సంవత్సరమునకు పూర్వము 28.35 లక్షలు కేటాయించినట్లుగా చెప్పారు. అయితే యీ amount ను అంతా Local Development Works కొరకు కలెక్టర్లకు పంపించారా? పంపితే, వచ్చే ఏప్రియల్ నెలనుంచి కేంద్ర ప్రభుత్వంవారి కార్యక్రమాలను కొనసాగించటానికి వీలుగా ఉంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అవి యింకా పంపించలేదు. Plans అన్నీ తయారుచేసిన తరువాత, ఏఏ జిల్లాకు ఎంతెంత పంపవలెనో చూచి, ఆయా జిల్లాకు అంతంత పంపటానికి allotment జరుగుతుంది.

SRI R. B. RAMAKRISHNA RAJU :—ఈ 28.35 లక్షలలో గత సంవత్సరంలో unfinished గా ఉన్నటువంటి works కి కూడా ఇది apply అవుతుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది ఆలోచించాలి.

SRI V. VISWESWARA RAO :—Local development works కి ఇక allotment లేదనీ, వాటిని ఆపెయ్యాలనీ జిల్లాలో చెప్పడం జరుగుతోంది. కాబట్టి ఈ మొత్తాన్ని వెంటనే allot చేసి పంపించినప్పుడే సాధ్యమవుతుందని, గత సంవత్సరంకూడా ఆఖరు నిముషంలో రావడంవల్ల కొన్ని works కి allotted amount ఖర్చుపెట్టడానికి అవకాశంలేకుండా పోయింది. అందువల్ల ప్రభుత్వం వెంటనే చర్యతీసుకుని పంపిస్తుందా?

THE HON. SRI D. SANJIVAYYA :—అవును. ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో Local development works ఉండవనే అనుకున్నాం మొట్టమొదట. కాని భారత ప్రభుత్వంవారు తరువాత decide చేసి local development works programme ఉంటుందని మాకు ఉత్తరువులు అందజేసినారు. ఆ కారణంచేత ఈ 28.35 లక్షలూకూడా త్వరగా collect చేసి పంపిస్తున్నాం.

SRI C. SUBBARAYUDU :—Incomplete works ఆగిపోవడం జరుగుతోంది. జిల్లాల వారీగా allotment ఇంకా కాస్త ఆలస్యంగా చేసినప్పటికీ కూడా ఆ incomplete works తో ఐనా proceed కమ్మని Collector లకు ఉత్తరువులు జారీ చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఈ question రామకృష్ణ రాజుగారు ఇదివఱకు వేశారు. దాని విషయం ఆలోచిస్తున్నాం.

SRI N. C. SESHADRI :—ఈ 28.35 lakhs కూడా population basis పైన allot చేస్తున్నారని తెలుస్తోంది. ప్రతి జిల్లాకుకూడా అవిధంగా కాకుండా జిల్లాలన్నింటికి కూడా సరిసమానంగా పంచిపెట్టడానికి ప్రయత్నిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA :—Population basis కాదు. సరిసమానంగా కాదండి అసలు principle ఏమిటంటే, కొంతభాగం జనాభా నిష్పత్తిమీద, మిగిలింది backwardness of the area ని బట్టి allot చేస్తాం?

SRI M. NAGI REDDI :—మన 1956-57 Budget లో local development works కి 35 లక్షలు కేటాయించినట్లుంది. ఇప్పుడు మంత్రిగారు చెప్పినదానిలో 10 లక్షలు అని ఉంది. Detailed budget లో 35 లక్షలని ఉంది. ఈ తేడా ఏమిటి ? ఈ Local development works కు ఇచ్చేటటువంటి ధనం, ఆ దగ్గరప్రాంతాలవాళ్లు, కొంచెం డబ్బున్నటువంటివాళ్లు తొందర, తొందరగా చేయించుకోవడం జరుగుతోంది. అందుకని ఇవ్వనటువంటి గ్రామాలకు వచ్చేటట్లు చూడవలసిన అవసరం ఉంది. మెట్ట ప్రాంతాలకు, తక్కువ ఆదాయం ఉన్నటువంటివాటికి వచ్చేటట్లు ప్రభుత్వం చూస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇది దగ్గరనున్నవాళ్లకే ఇస్తున్నారనేది ఏమీలేదు. అసలు ఒకగ్రామానికి ఒక work కంటే ఎక్కువ ఇవ్వకూడదు. Special గా ఎక్కడైనా రెండు works ఇచ్చామేమోగాని, ఒక పట్టణానికో, ఒక పల్లెకో ఒక work కంటే ఎక్కువ ఇవ్వకూడదని ఉన్నది. ఇతర ప్రాంతాలుకూడా దీని advantage తీసుకుంటున్నాయి.

SRI L. LAKSHMANA DAS :—ఈ L. D. works చాలాప్రాంతాలకు ఉపయోగంగా వున్నాయి. అందుచేత ఇవి మళ్ళీ National extension scheme area లలో గాని, లేక community development area లో గాని ఎక్కడాలేకుండా, కేవలం ఇతరప్రాంతాలలోనే ఈ డబ్బు ఖర్చుపెట్టాలని ప్రత్యేకంగా order లు జారీచేస్తారా?

THE HON SRI D. SANJIVAYYA :—అటువంటి order లు ఇంతకుముందే ఉన్నాయి.

*Tungabhadra High Level Channel.*

725—

* 1034 Q.—SRI S NARAYANAPPA .—Will the Hon. the Deputy Chief Minister be pleased to state .

(a) the complete length of the Tungabhadra High Level Channel ;

(b) the number of acres that will be irrigated in Uravakonda Sub-Taluk and in Gooty Taluk ;

(c) whether Pattakondacheruvu tank, Yerra Thimmaraya Cheruvu, Gooty tank, Appecherla and Jukkala Cheruvu tanks will get supply of Tungabhadra water ; and

(d) the number of acres that will be brought under irrigation in Anantapur Taluk and in Cuddapah District ?

THE HON. SRI N SANJEEVA REDDI :—

(a) The length of the High Level Canal is M. 122-7 F and the length of all branches is M. 234-00.

(b) The total ayacut that will be irrigated in Gooty Taluk is 21,000 acres. The extent irrigated in Uravakonda Sub-Taluk is not separately and readily available.

(c) It is presumed that Pattakonda Cheruvu is a mistake for Pathakota Cheruvu The three tanks viz, Pathakota Cheruvu, Yerra Timmaraya Cheruvu and Gooty Tank will be fed, by the Gooty branch of the High Level Canal. The other two tanks will not receive supply as they are situated in uncommandable area under Gooty Branch.

(d) Anantapur Taluk 35,000 acres. Cuddapah District 1,41,205 acres.

SRI S. NARAYANAPPA·—ఈ తుంగభద్ర ఎగువకాలవపని ఎంత కాలంలో ప్రారంభిస్తారు ? ఇప్పుడు బళ్ళారి సమస్య ఒకవిధంగా సంగ్ధావస్థలో ఉంది కాబట్టి Pennar river పడమటిదిశనుంచి కాలవత్రవ్వడానికి మనప్రభుత్వం వారు ప్రారంభిస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—బళ్ళారి సమస్యపైన ఇది ఆధారపడిలేదు. బళ్ళారి మనకు వచ్చినా రాకపోయినా ఈ కాలువవిషయం ప్రత్యేకంగా పరిశీలనచేస్తాం. ఆంధ్ర ప్రభుత్వం పంపిన plan లు, estimate లు సక్రమమైనవని ఇప్పుడు States Re-organisation Bill లో నే అంగీకరించారు. కాబట్టి Planning Commission వారు మైసూరుప్రభుత్వానితో కూడా ఆలోచించి వెంటనే పని ప్రారంభించడానికి ఉత్తరువులు జారీచేస్తారని అనుకుంటున్నాం.

SRI C. SUBBARAYUDU :—ఇప్పుడు మంత్రి గారు జవాబుచెప్పడంలో అప్పిచర్ల, జక్కులచెరువు మొదలగునవి command కావన్నట్లు నేను విన్నాను. ఇంతకుపూర్వం investigation ప్రకారంగా command అవుతుంది. అంతే కాకుండా తొండపాడు branch పొడిగించినట్లయితే ఇంకా 40, 50 వేల ఎకరాలు సాగులోకిరావడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈవిధంగా eliminate ఐనటువంటి areas ను గురించి representation చేశాం. దాన్నిగురించి ప్రభుత్వం ఏమి ఆలోచనచేసింది ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— నాకిప్పుడు ఇంజనీర్లిచ్చిన information మీకందజేస్తున్నాను. నాకిప్పుడు Chief Engineer, (Irrigation) ఇచ్చిన report ను బట్టి అప్పిచర్ల చెరువు, జక్కులచెరువు ఇవి మిట్ట ప్రదేశంలో ఉన్నాయని, వాటికి నీరు సరఫరాచెయ్యడం కష్టమనీ ఇప్పుడు information ఇచ్చారు. ఇంకా ఏదైనా పాత information ఉంటే పరిశీలనచేయమనీ, ఎక్కడెక్కడకు నీరు సరఫరాచేయడానికి వీలవుతుంది, నీరు ఎంతుంది, ఇవన్నీ తప్పకుండా ఆలోచించమని చెబుతాం.

SRI N. C. SESHADRI:—ఈ High Level Canal పోయేటటువంటి areas లో చాలాభాగం drinking water facilities లేని ప్రదేశాలు చాలా ఉన్నాయి. కాబట్టి ఈ channel లో నుంచి drinking water ఆ గ్రామాలకు సరఫరాచేయుటకు ఇందులో provide చేస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—కాలవలో నీళ్లు పోతూ వుంటాయి. ఎవరైనా తాగుతామంటే ఏమాత్రం ఆక్షేపణచెయ్యం.

SRI PILLALAMARRI VENKATESWARLU :—High level channel క్రింద ఆయకట్టు ఇప్పుడున్నటువంటి, Mysore State కి ఎంత ఉంటుంది, మనరాష్ట్రంలో ఎంత ఉంటుంది.

THE HON. SRI N. SANJEEVA REDDI :—Mysore State కి 80 వేల ఎకరాలు,—అంటే బళ్ళారిప్రాంతం అన్నమాట.—సాగవుతుంది ఈ High

Level Channel వల్ల అనంతపురంజిల్లాలో 1,46,500 ఎకరాలనీ, కడపజిల్లాలో 1,41,205 ఎకరాలనీ, కర్నూలుజిల్లా అంటే ఆలూరు తాలూకాలో 28,500 ఎకరాలు సాగవుతుందని అంచనా

SRI K. KOTI REDDI .—కడపజిల్లాలో అంటే తాలూకావారీగా చెబుతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—కడపజిల్లాలో ఇంకా details కావాలంటే ఇస్తాను. కడపజిల్లాలో జమ్మలమడుగు తాలూకాలో 35,385 ఎకరాలనీ, పులివెందలతాలూకాలో 36,680 ఎకరాలనీ, కమలాపురం తాలూకా మీదుగా కాలువపోవాలనుకుంటాను, 42,790 ఎకరాలనీ, ప్రొద్దుటూరుతాలూకాలో 26,350 ఎకరాలనీ rough estimates మాకు ఇప్పుడు అందినాయి.

SRI K KOTI REDDI :—కడపతాలూకాకు ఏమీలేదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—కమలాపురం sub తాలూకాకాక, కడపతాలూకాఅనే ఇక్కడ information లో ఉంది. నేను కమలాపురంఅని కలిపాను, కమలాపురందాటే కడపకుపోవాలి కాబట్టి ఇక్కడున్న information కడపతాలూకా 42,790 ఎకరాలని కమలాపురంవాళ్లు మా తాలూకాలేదా అని అడుగుతారని కమలాపురంమీదుగానే ఈ కాలువ పోతుందని చెప్పాను.

SRI P. BASI REDDI :—ఈ High level canal మొదట Head works నుంచీ ప్రారంభంచేస్తారా, లేక ఏదైనా division ఏర్పాటుచేసి అన్నిటికీ ఒకేసారి ప్రారంభం చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Head works లో ప్రారంభం చేయకపోతే మిగిలినచోటచేసి లాభంఉండదు. కాలువ ఆంధ్రప్రదేశానికి వచ్చిన తరువాత ఎన్నిభాగాలుగానైనాచేసి మనపని ప్రారంభించుకోవచ్చును. నా ఉద్దేశ్యం head works దగ్గర Mysore state వారుగాని తుంగభద్ర Board వారు ప్రారంభిస్తే తరువాత మనం మన area నుంచి రెండు మూడు Sub divisions పెట్టుకొని ఒక Superintending Engineer ని separate గా పెట్టుకుని ఉరవకొండదగ్గర, అనంతపురందగ్గర, తాడిపత్రిదగ్గర, గండిదగ్గర ఈ రకంగా మనం 4, 5 చోట్ల పని ప్రారంభించుకోడానికి వీలవుతుంది. కాని Planning Commission వారు allot చేసే డబ్బునుపట్టి ఉంటుంది ఆ కార్యక్రమం.

SRI P. HANUMANTHA REDDI :—కర్నూలు జిల్లాలో ఏఏ తాలూకాకు ఎంతభూమిఉంది?

[5th April 1956

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఆలూరు తాలూకాలో 28,500 ఎకరాలు.

SRI M. RAJA RAM.—అధ్యక్షా, తుంగభద్ర ఎగువకాలువ వివాద ప్రాంతమగు బళ్ళారిగుండా రావలసివున్నది. బళ్ళారి ప్రజలు ఆంధ్రరాష్ట్రంలో చేరకుండాఉంటే, కానివల్ల వారు ఆవేశంతోనో ఆవేదనతోనో ఆ నీరు రాకుండా అనేకయిబ్బందులుపెట్టి గట్టుత్రవ్వి చెడిపేదానికి ప్రయత్నంచేస్తున్నారు. కాబట్టి బళ్ళారి ప్రాంతంగూడ ఆంధ్రలో కలిపేటట్టుగా ప్రభుత్వంగట్టి ప్రయత్నంచేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ప్రజలు కొంచెం ఉద్రేకపరిస్థితులలో వున్నప్పుడు అలాంటివి కొన్ని కొన్ని చేస్తారు. కాని అది కొద్దిరోజులే. అంతేకాని నీరు శాశ్వతముగా రాకుండా చేయడానికి పూనుకోరు. అట్లుచేస్తే, ప్రభుత్వంవున్నది. తప్పకుండా రక్షణయిస్తుంది. కాలువలను చెరువులను buildings ను వీటినన్నిటిని కాపాడుతుంది.

SRI K. V. VEMA REDDI —అనంతపురంజిల్లా కదిరి తాలూకాను గాని, పెనుగొండ తాలూకానుగాని, ధర్మవరం తాలూకానుగాని ఏమైనా యీ కాలువ ఉపయోగపడుతుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—నేను యిది పరిశీలన చేయించినప్పుడు ధర్మవరంతాలూకా commandable అనేకాని మరి నీరున్నది limited. విస్తీర్ణముమూస్తే చాలావున్నది మన జిల్లాలో. అనంతపురంజిల్లాలో 1,80,000 ఎకరాలుమాత్రం సాగవుతుందంటే, ఇంకను 5, 6 లక్షల ఎకరాలు సాగుచేయించడానికి కావలసినభూమి ఉన్నది. ఉన్ననీటిని 3 జిల్లాలలో సమానంగా పంచిపెట్టాలనే ఉద్దేశ్యంతో ఒకే జిల్లాలో ఎక్కువ area తీసుకోవడం లేదు ధర్మవరం తాలూకాకూడా సాగవుతుంది. ఇంకా వీలయితే higher level కు తీసుకుపోతే canal ద్వారా బహుశా పెనుగొండ తాలూకాకు నీరు పోవడానికి వీలుఉంటుందేమోకాని ఎక్కువనేలను ప్రతిజిల్లాలో అంతటను irrigate చేయడానికి వీలులేదు. ఆరకంగాచేస్తే కడపజిల్లాకు ఒక చుక్కకూడా నీరు పోవడానికి వీలులేదు. అదే వచ్చినయిబ్బంది.

SRI S RANGANATHA MUDALIAR.—Is there any chance for any portion of Chittoor district getting supply from this High Level Channel at any time ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—For that the channel should be at a much higher level and this cannot be taken so high.

5th April 1956]

SRI C. SUBBARAYUDU :—నీటి పంపకాన్ని గురించి Mysoreతో పరిష్కారం అయినట్లుగా విన్నాం. మనకు ఎంతనీరు వస్తుంది? Mysore కు ఎంతవస్తుంది? Main canal lined 4,000 Cusecs బదులు unlined చేస్తే శేషప్రొద్దున సిద్ధేశ్వరం నీరుగాని K. C Canal నీటిని divert చేసినప్పుడు ఆ main canal పెంచుకోడానికి అవకాశం ఏర్పడుతుంది. ఆ విషయంగురించి ప్రభుత్వం ఏదైనా ఆలోచనచేసినదా, చేయకపోతే చేస్తుందా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— మైసూరు ప్రభుత్వానికి మనకు ఎంతనీరు అనేదాన్ని గురించి ఒక Common agreement కు ఏమీరాలేదు. మనకు major portion రావాలి? 80, ఎకరాలుమాత్రం బళ్ళారిప్రాంతంలో రావాలని మన ప్రభుత్వం మొదటినుంచీ వాదిస్తున్నది. కాలువ capacity ఎంతైనా కానివ్వండి. మైసూరు రాష్ట్రానికి 18,000 acres కు నీరువదిలి మిగిలినది అంతా మాకిస్తే అనంతపురంలోనో తాడిపత్రిలోనో మా కడప అనంతపురం జిల్లాలలో పారించుకుంటాం అని Mysore ప్రభుత్వంతో వాదిస్తున్నాం. కాని యీ మధ్య ప్రత్యేకరాష్ట్రంలో సగానికెసగం నీరు మాకు రావాలని వారు వాదిస్తున్నారు. Planning Commission వారు యిదంతాచూచి మనము పంపిన report చాలా సక్రమమైనది న్యాయమైనది అని అనబట్టే యీ bill లోకూడా ఆంధ్రప్రభుత్వం పంపినదానికి broad principles ను accept చేస్తున్నామని అన్నారు. మనము కోరినట్టు మైసూరువారికి 18,000 acres వరకు యిచ్చి మిగిలిందంతా మనం తెచ్చుకుంటే మన కాలువలు line చేయాలనా లేకపోతే ఏఏ తాలూకాకు నీరు తీసుకుపోవాలనేదికూడా మనం ఆలోచించుకోవచ్చు. మరిక్కడ controversy begin కాకుండా చేయాలనే ఉద్దేశ్యంతోనే అనంతపురంలో ఎక్కువభూమి ఉండికూడా కడపజిల్లాకు న్యాయంగా యివ్వవలసినది యివ్వాలని అనుకుంటున్నారు. ఇంకా ఎక్కువ నీరుంటే మనము సర్దుకోడానికి పెంచడానికి ప్రయత్నంచేస్తాము.

*Well subsidy schemes.*

724—

*1223 Q.—SRI P GOPALU REDDI :—Will the Hon. the Minister for Agriculture be pleased to state ;

(a) whether representations were received by Government from the ryots of Chittoor District regarding well subsidy schemes, urging the Government for reconsideration

of the conditions for commencing and completion of the wells ;

(b) if so, the action taken thereon , and

(c) whether this Government propose to represent to the Centre and obtain this concession in the matter of subsidy, wells, their commencement and completion ?

THE HON. SRI K OBULA REDDI —

(a) Yes Sir,

(b) The matter is under consideration.

(c) No, Sir.

SRI R. B. RAMAKRISHNA RAJU :— Well subsidy scheme క్రింద బావులను time లో పూర్తి చేయకపోయినా అటుపిమ్మటనైనా బావులనంతా పూర్తిచేసినటువంటి విషయాలు చాలా వున్నాయి. వాటినిగురించి రైతులు చాలా ఆందోళనచేస్తున్నారు. Time లో చేయకపోయినా బావులు పూర్తయి వుంటే వాటి విషయమై Government వారు Government of India కు recommend చేయడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI K. OBULA REDDI :—Government of India కు recommend చేసేదానికి ఏమాత్రం వీలులేదు. లోగడ యిలా recommendations చాలా చేశాము, వీలులేదని వాళ్లన్నారు. కనుక దానివల్ల ఏమీ ప్రయోజనం ఉండదు. మన ప్రభుత్వం ఏమయినా చేయగలదేమో ఆలోచించాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికి ఉన్నది.

MR SPEAKER :—This is in respect of Chittoor district and not a general question for so many Hon. Members to put supplementary questions.

*Establishment of a Sub-Treasury at Mangalagiri.*

726—

* 374 Q.—SRI MEKA KOTI REDDI & SRI M NAGI REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state .

(a) whether any representations were received recently from the Public of Mangalagiri for the establishment of a Sub-Treasury ; and

5th April 1956]

(b) if so, the action taken thereon ?

THE HON. SRI K. CHANDRAMOULI .—

(a) The answer is in the affirmative.

(b) The matter is under the consideration of the Government in consultation with the Board of Revenue.

*Disposal of certain Lands in Mapur village of Nellore taluk.*

727—

*889 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state .

(a) whether the Government disposed of S. No. 356-A South Mapur village of Nellore taluk and district now ; and

(b) if so, the benefit derived from it ?

THE HON. SRI K. CHANDRAMOULI .—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI S. VEMAYYA :—Survey number యొక్క విస్తీర్ణం ఎంత ? ఈ భూమివల్ల ఎలాంటి ఆదాయముగూడ రాకుండా ప్రభుత్వం వృధాగా పెట్టడానికి కారణం ఏమిటి ?

THE HON SRI K. CHANDRAMOULI :—విస్తీర్ణంగురించి వేరే ప్రశ్న వేయాలండి. దీనిని ప్రస్తుతం temporary గా యిది Nagarjuna Sagar Project క్రింద affect అవుతుందనే ఉద్దేశ్యంతో అది assign చేయకుండా ఉంచబడింది.

SRI S. VEMAYYA :—Permanent గా పట్టా యివ్వకుండాపోతే అది project affected area అని చెప్పి తాత్కాలికంగా ఏదయినా పైరులు పెట్టుకొనడానికి యివ్వడానికి ప్రభుత్వానికి ఏమి ఆటంకం ?

THE HON. SRI K. CHANDRAMOULI :—దీనిగురించి ఆలోచించడానికి ప్రస్తుతం అది ఆ రకంగా అట్టి పెట్టారు. తరువాత ఆలోచించి ఎట్లా చేయాలో చెబుతాను.

SRI B. SANKARAYYA :— ఇదివరకు project ఉంచేటటువంటి area ను గురించి ప్రతిదఫా ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. ఆదారిన పోయే దంతాకూడా మళ్లా project area అని అన్నిపనులు నిలిపివేయడం న్యాయం కాదు. మరల ఒకసారి ఆలోచించి యిప్పుడది పెన్న project క్రింద ఉంచే area కాబట్టి దానిని పరిశీలన చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—Project క్రింద రాని దానిని project క్రిందికి వచ్చిందనరు. వచ్చిందానిని కాదనడానికి వీలులేదు.

SRI S. VEMAYYA :—అసలు యీ భూమిబంజరుభూమా ? పట్టాభూమా ?

THE HON. SRI K. CHANDRAMOULI:— పట్టాభూమయితే చిక్కులేదు.

*Provision of drinking water wells in Krishna District.*

728—

* 689 Q.—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

the number of applications from each of the taluks of the Krishna District for the provision of drinking water wells pending with the Collector, Krishna on 31—3—1955 ?

THE HON. SRI G LATCHANNA :—

No applications, from any of the taluks of Krishna District for the provision of drinking water wells to the Harijans were pending with the Collector of Krishna on 31—3—1955.

ఈ Rural Water Supply Scheme యిప్పుడు H. and L.A. department అజమాయిషీ క్రింద వున్నందువల్ల Collector గారివద్ద 55 March 31 వ తేదీకి మంచినీటి బావులకు సంబంధించిన ఏ దరఖాస్తులూ కూడా pending లో లేవు.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, Harijans కి drinking water సప్లయికి బావులు త్రవ్వించేటప్పుడు సంవత్సరానికి ఒక department

మార్చడం అనేది జరుగుతున్నది. ఒకసారి Collector Rural Water Supply Scheme క్రింద కొన్ని త్రవ్వించడం, Collector గారికి petitions పెట్టడం, Harijan Welfare Department కొన్ని త్రవ్వించడం, తరువాత ఇంకొక department కు మార్చడం యిటువంటివి జరగడంవల్ల petitions ఒక ఆఫీసునుంచి యింకొక Office కు మారడానికి చాలా సంవత్సరాలు పట్టడం, చర్య తీసుకోకపోవడం, జరుగుతున్నది. అందువల్ల వెంటనే చర్య తీసుకుంటారా ?

THE HON. SRI G. LATCHANNA :—గౌరవ సభ్యులు వచ్చి ఒక సంవత్సరమే అయినది. ప్రతి సంవత్సరం మారిందని అనుకోవలసిన అవసరం లేదు Harijan Water Supply, Rural Water Supply క్రింద గత ఏడాది మార్చబడ్డది. అందువల్ల ఇది ప్రతి ఏడాదీ మారుతున్నదని అనుకోడం భావ్యంకాదు. ఇది వారి పరిశీలనలో వున్నది. ఏదయినా emergency meet చేయడానికి Harijan Welfare నుండి meet చేయడానికికూడా ఒక provision వున్నది.

*Drinking water wells for Harijans in Srikakulam District.*

729—

* 858 Q.—SRI K. PUNNAYYA.—Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state :—

(a) number of drinking water wells constructed for Harijans in each taluk of Srikakulam District during 1953-54, 1954-55 ;

(b) the number of wells proposed to be constructed for Harijans in each taluk of Srikakulam District during 1955-56 ;

(c) the total amount allotted for this purpose from Harijan Welfare funds during 1953-54, 1954-55, 1955-56 ; and

(d) the total amount spent for this purpose during the respective periods ?

THE HON. SRI G LATCHANNA :—

(a), (b), (c) and (d) : A statement is placed on the Table of the House.

---

* Vide appendix at page 589 infra.

THE HON. SRI G. LATCHANNA :—(a), (b), (c) మరియు (d) ఒక Statement ను table మీద పెట్టడమయినది.

SRI K. PUNNAYYA :—(c) క్రింద Statement లో 1955-56 amount allotted లో 60,900 ఏర్పాటు చేశారు. ఖర్చు 31,154 రూపాయ లన్నారు. తక్కిన amount ఏమయినది ? Lapse అయినదా ? కారణాలు వివరించుతారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇది February 20 వ తేది వరకు జరిగిన ఖర్చు Collector యిచ్చిన report ప్రకారం 31,154 రూపాయలు మిగతా వాటి estimate తయారు కాకపోయినందువల్ల అది pending లో ఉండ డానికి అవకాశం వుంటుందని భావిస్తున్నాను.

SRI K. PUNNAYYA :—ఒక నెలలో తక్కిన 30,000 రూపాయలు ఖర్చు పెడతారా లేదా ? Lapse అవుతుందా ?

THE HON. SRI G. LATCHANNA :—ప్రశ్న ఎంత ఖర్చయినదని వచ్చింది? దానికి సంబంధించిన మిగతా భాగం report వచ్చింది. అది యిప్పుడు exemption లో ఉన్నదా లేదా అనేది Collector నుంచి report వచ్చిన తరువాత సభ్యులకు తెలగట్టా యివ్వగలను.

SRI N. K. LINGAM :—అధ్యక్షా, ఈ Harijan Welfare Department ఉద్యోగులు ప్రభుత్వం యిచ్చినటువంటి డబ్బును సక్రమంగా ఖర్చుపెట్ట కుండా వున్నందున యిటువంటివి జరిగాయని ప్రభుత్వ దృష్టికి అనేకసార్లు తెచ్చాం. అటువంటి వారిపైన కఠిన చర్య ప్రభుత్వం ఎందుకు తీసుకోలేదు? అటువంటి వారి పైన యిప్పుడయినా చర్య తీసుకుంటారా?

THE HON. SRI G. LATCHANNA :—ఇది శ్రీకాకుళం జిల్లాలో వచ్చిన ప్రశ్న, దీనిమీద general గా ప్రశ్నిస్తే జవాబు చెప్పడానికి time చాలదు.

SRI S. VEMAYYA :—(b) దగ్గర 1955 వ సంవత్సరానికి proposed wells 481 propose చేశారు. ఈ 481 లో ఎన్ని పూర్తయినాయి? ఎన్ని execution లో వున్నాయి?

THE HON. SRI G. LATCHANNA:—1954-55 లో wells constructed ఎన్ని అనేదికూడా ఆ Table లోయిచ్చి వున్నాం. అవి 31.

*Agricultural College, Bapatla.*

730—

* 793 Q.—SRI P. VENKATA SUBBAIAH :—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

whether the students who have passed from the Agricultural College, Bapatla in 1954-55 have secured employment ?

THE HON SRI K. OBULA REDDI :—

Yes, Sir.

*Compensation to the Ex-Jagirdars of Boravancha village.*

731—

*951 Q —SRI P. BAPAIAH :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether any compensation was paid to the Ex-Jagirdars of Boravancha Village in Nuzvid Taluk, Krishna District by this Government after its merger into Indian Union ;

(b) is it a fact that the Ex-Jagirdars have collected the assessment for five faslies (i e., 1359 to 1363 Faslies) even though the Jagir was abolished under the provisions of the Hyderabad Jagir Abolition Regulation of 1358 Fasli prior to its merger ;

(c) whether the Government deducted the assessment collected by the Ex-Jagirdars for five Faslies i.e , from 1359 to 1363 Faslies from the amount of compensation, if paid to them ;

(d) is it a fact that the Ex-Jagirdars had cut and removed the valuable trees lying in the Government poramboke adjoining the Government Village Chavadi in April, 1955 ; and

(e) if so, the action taken thereon ?

5th April 1956]

THE HON SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the negative.

(b) No collections of assessments for five faslies (i.e., Fasli 1359 to 1363) have been made by the Ex-Jagirdars.

(c) Does not arise

(d) It has been reported that the Ex-Jagirdars had cut some tamarind trees close to the Village Chavadi in the month of April, 1955. The site however is not a Government poramboke but a private site belonging to a mosque and the Government cannot interfere in the matter.

(e) Does not arise

SRI P. BAPAYYA :—ఇప్పుడు ఆ సైటు ప్రభుత్వం క్రింద ఉన్నదా? లేకపోతే ఆ జాగీరుదారు క్రింద ఉన్నదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రభుత్వానిది కాదని చెప్పాను.

SRI S. VEMAYYA :—అక్కడ చింతచెట్లు కొట్టినట్లు రిపోర్టువచ్చింది. ఆ రిపోర్టు పంపినది గవర్నమెంటు ఉద్యోగి కాదా? భూమి గవర్నమెంటుదో ప్రైవేటుదో తెలియకుండా రిపోర్టు చేసేడా?

THE HON. SRI K. CHANDRAMOULI :—నేను పేరు చెప్పగలను వేమయ్యగారు వారిని అడగవలెను.

SRI V. VISWESWARA RAO :—గ్రామ చావడి ప్రభుత్వ ప్రదేశములో ఉన్నదా, లేక ప్రైవేటు స్థలములో ఉన్నదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రశ్న చావడికి సంబంధించినది కాదు. చెట్లు ఉన్న సైటు మనది కాదు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఆ జాగీర్దార్లు శిస్తులు వసూలు చేస్తున్నట్లు తెలుస్తున్నది దానికి సంబంధించిన జిల్లా ఆఫీసర్లు ప్రెసిడెన్సీ ఆఫీసర్లు మద్దత్తు ఇస్తున్నట్లు తెలుస్తున్నది. ఇంకా వసూలు చేస్తున్నారు. వారిమీద ఏమైనా చర్య తీసుకున్నారా? మొత్తం డబ్బు వసూలు చేస్తారా? clarify చేస్తారా?

5th April 1956]

THE HON. SRI K. CHANDRAMOULI :—జాగీర్దార్ల వసూలు చెయ్యడము లేదు. 1955 Amendment Act ప్రకారము హైదరాబాదు ప్రభుత్వం కొంత pay చేసినది. తక్కినది మన Tribunal ప్రకారం pay చేస్తామని ఒప్పుకొన్నాము. అందుచేత ఇప్పుడు వారు వసూలు చేసే ప్రశ్న లేదు ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇదివరకూ మీరు finalise చెయ్యకముందే రెండు సంవత్సరాలకు పూర్వముకూడా వసూలు చేసినారు. ఆడబ్బు refund ఇప్పిస్తారా? లేక గవర్నమెంటు ఇస్తుందా?

THE HON. SRI K. CHANDRAMOULI —ఈ ప్రశ్నలో వారు చెప్పిన ఫసలీ విషయంలేదు. వసూలు చెయ్యలేదంటే, refund సంగతి ఎలాగు వస్తుంది ?

*Sisma Formula.*

732—

*1083 Q.—SRI B APPA RAO .—Will the Hon. the Minister for Agriculture be pleased to state .

(a) whether the Vizagapatam Sugars and Refinery Limited, has implemented the SISMA Formula in 1955-56 ; and

(b) if not, the action taken thereon ?

THE HON. SRI K. OBULA REDDI :—

(a) The answer is in the negative

(b) The SISMA Formula is not derived under any statute, and is not therefore capable of enforcement except as a measure of voluntary agreement between the parties. The Vizagapatam Sugars and Refineries Limited had never undertaken to implement the SISMA Formula and no action would therefore lie.

SRI B. APPA RAO :—ఈ formula ఫ్యాక్టరీలలో అమలు జరిపే దానికి చట్టబద్ధము చెయ్యడానికి కేంద్ర ప్రభుత్వంద్వారా ప్రయత్నం చేస్తారా ?

THE HON SRI K. OBULA REDDI :—ప్రయత్నం చేస్తామండి.

SRI V. VISWESWARA RAO :—Statutory provision లేదన్నారు? గాని పెద్ద మనుష్యులు దానిని అంగీకరించి వ్యతిరేకించడం జరిగింది. వారిమీద moral pressure వినియోగించి అమలుజరిగేటట్లు చేస్తారా?

THE HON. SRI K. OBULA REDDI :—శిస్త్రు ఫార్ములాలా కేంద్ర ప్రభుత్వం అమలు జరపదు. వారిమీద చర్యతీసుకునే తాహతు మనకులేదు. దాని కోసం ప్రయత్నం చేస్తాము.

*Selection of Deputy Tahsildars in Nellore District.*

733—

*897 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state

(a) whether it is a fact that there was no selection of Deputy Tahsildars since 1952 till 1955 in Nellore District ;

(b) if answer to clause (a) is in the affirmative the reasons therefor ,

(c) whether there is any age restriction even to those persons who passed the tests in time but could not be included in the list of Deputy Tahsildars for want of vacancies , and

(d) if answer to clause (c) is in the affirmative whether the Government propose to relax the rule in these special cases as the affected persons are not responsible for becoming overaged ?

THE HON SRI K CHANDRAMOULI :—

(a) There was no selection of candidates for the Deputy Tahsildars' list for the Nellore District for the years 1952, 1953 and 1954.

(b) There were several candidates in the approved list of Deputy Tahsildars awaiting appointment during the period and there was, therefore, no need to include any new names in the approved lists for the years 1952–54

(c) The answer is in the affirmative.

(d) The Government will consider deserving cases for relaxation of the age rule.

SRI S. VEMAYYA :— ఇప్పుడు ఖాళీలు లేనందువల్ల list లేదు అని చెప్పారు. 1952 నుంచి నేటివరకు ఖాళీలు వచ్చినప్పుడు వారు ఎవ్వరైనా

Sri A. Bapineedu] [5th April 1956

ఇక Regional Council's విషయం ఆలోచించవలసి ఉన్నది. వెనకబడిన ప్రాంతాలను అభివృద్ధిపరచుటే ఈ ప్రాంతీయ సంఘాల ఆశయం అని కేంద్ర ప్రభుత్వం అంటే అనవచ్చు. వెనుకబడిన ప్రాంతలను అభివృద్ధిపరచుటకు ప్రాంతీయ సంఘాలు ఉండనక్కరలేదు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడక పూర్వం ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ జిల్లాలు నష్టపడిపోతాయనే అపోహ కొందరిలో ఉండినది. కాని ఈనాడు జరుగుతున్నది ఏమిటి? కోట్లకొలది రూపాయలు గత, 2, 3 సంవత్సరాలలో రాయలసీమ ప్రాంతంలో వెచ్చించడం జరిగింది. ఏ ప్రాంతాలలోనైనా ప్రజల ఆర్థిక స్థితిని పెంపొందించేందుకు ఎంత ఖర్చు చేసిన మాకేమీ అభ్యంతరంలేదు. ఇదే విషయాన్ని తెలంగాణా సోదరులకుకూడా మనవిచేస్తున్నాను. తెలంగాణా ప్రాంతం నుంచి వచ్చే అదనపు ఆదాయాన్ని తీసుకొనిపోయి సర్కారు జిల్లాలలోనే ఖర్చు పెడతారని, ఉద్యోగాలను సర్కారుల జిల్లాలవారే ఎక్కువగా సంపాదించుకొంటారనే అపోహపడవద్దని కోరుతున్నాను తెలంగాణావారికి అటువంటి అపోహ కలగడంకూడా న్యాయంకాదని నా అభిప్రాయం. ఈ అనుమానాలను అధారం చేసుకొని ప్రాంతీయ సంఘాలు కావాలని పట్టు పట్టడం సమంజసంకాదేమో.

ఈ ప్రాంతీయ సంఘాలయొక్క అవసరం ఏమిటి? ఈ నలుగురు నాయకులు తమ అధికారాన్ని నిలబెట్టుకోవడానికి వారి ఆత్మీయులకు ఉద్యోగాలు ఇవ్వడానికి మాత్రం ఈ సంఘాలు ఉపయోగిస్తాయేమో తెలియదు. అటువంటి సంఘాలను ఏర్పరచుకొని మళ్లీ నైజాము నవాబు కాలములో ఉంటే bureaucracy ని చిరస్థాయి చేద్దామనే ఉద్దేశ్యం తప్ప వేరే ఏమి లేదని నాకు తోస్తున్నది. విశాలాంధ్ర ఆదాయంలో అన్ని ప్రాంతాలవారికి సమాన హక్కు ఉన్నది. ఈ ప్రాంతంలో ఎంత ఖర్చు చేయవలసిందీ నిక్కచ్చిగా చెప్పడంలో న్యాయంలేదు. ఏ ఏ ప్రాంతాలలో ఏవి పనులు చేయవలసి ఉన్నదో ఆ పనులన్నీ చేయవలసి ఉన్నది. ఒక ప్రాంతం వెనుకబడి పోతుందేమోనని, అభివృద్ధికాదేమోనని అనుమానించి కేవలం ఆ అనుమానాలను ఆధారం చేసుకొని ప్రాంతీయ సంఘాలు ఉండాలని పట్టుపట్టనక్కరలేదు. ఎక్కడ ఏ పని కావాలో అందరు కూర్చొని ఆలోచించుకుని వాటిని కొనసాగించుకొందాము. ఏ అవసరమైతే వచ్చే 2 సంవత్సరాలు ఏవిధంగా ప్రభుత్వ ధనాన్ని వ్యయపరచాలో, ఎక్కడ ఏ పాఠశాలలు కావాలో, ఏ Colleges కావాలో, ఏ అభివృద్ధి పథకాలు అమలు జరపాలో వాటిని మీరే నిర్ణయించుకోండి. వాటిని ఆధారముచేసుకొని Budget ను తయారుచేయవలసిందికూడా మన తెలంగాణా సోదరులకు చెపుదాము. మనమంతా సోదరులము, ఒకరినొకరు అనుమానించుకోనక్కరలేదు.

5th April 1956] [Sri A. Bapineedu

ఇక భాషా రీత్యా అల్పసంఖ్యాక వర్గంవారి సమస్య ఒకటి ఉత్పన్నమౌతున్నది. అంతేకాకుండా ఉద్యోగాల పంపిణీ విషయంలోకూడా ఎన్నో సమస్యలను మనం ఎదుర్కోవలసియున్నది. ఈ ఉద్యోగాల పంపిణీ విషయంలో న్యాయమైన దృక్పథాన్ని మనం కలిగి ఉండాలి. క్రొత్త రాష్ట్రంలో ఎంతోమంది ముస్లిం సోదరులు ఉన్నారు. మన రాష్ట్రంలో తెలుగువారు ఉన్నారు, అరవలు ఉన్నారు, కన్నడిగులు ఉన్నారు, ముస్లిములు ఉన్నారు వీరందరికి న్యాయమైన పద్ధతులలో ఉద్యోగాలు ఇవ్వాలి. అంతేగాని కేవలం appeasement policy ని మాత్రం మనం అనుసరించరాదు. రాజ్యాంగ చట్టం రీత్యా వివిధ వర్గాల వారికి రక్షణ కలుగచేయవలసిన బాధ్యత ప్రభుత్వాలపై ఉన్నది. అటువంటప్పుడు ప్రత్యేకమైన రక్షణలు కలుగచేయనక్కరలేదు. రక్షణ కలుగదేమో, నష్టం వాటిల్లుతుందేమోననే అనుమానాలకు ఆస్కారంలేదు. నూతన రాష్ట్రం ఏర్పడిన తరువాత అన్ని ప్రాంతాల ప్రజలకు సమానమైన ప్రాతినిధ్యం ఉండాలి. అయితే రాష్ట్ర ఆదాయాన్ని ఏదో ఒక ప్రాంతములోనే ఖర్చుపెట్టాలనే వాదన సరైనదికాదు. దురదృష్టవశాత్తు గోదావరి కట్ట తెగితే (పాపముశమించుగాక) దానికి మరమత్తులు చేయడానికి ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు డబ్బు కేటాయించాను అని అనలేదు. ఒక ప్రాంతం డబ్బు ఇంకొక ప్రాంతంలో ఖర్చు చేయకూడదనే వాదన సరైనదికాదు. రాయలసీమలో క్షామము సంభవించినపుడు అక్కడ కోట్లకొలది రూపాయలను ఖర్చుచేయవలసి వచ్చినది. రేపు తెలంగాణా ప్రాంతంలో హెచ్చు మొత్తం ఖర్చు చేయవలసివస్తే అందుకు రాష్ట్ర ప్రభుత్వం వెనుకాడరాదు. అదేవిధంగా ఆయా ప్రాంతాలలోని అవసర అనవసరాలను గుర్తించి డబ్బు ఖర్చుచేయవలసిందిగాని ఈ ప్రాంతానికి ఇంత అని కేటాయించడం సరైనపద్ధతికాదు

Zonal Councils అనే వాటిని ఏర్పాటు చేసినట్లు ఈ బిల్లులో ఉదహరించారు. అయితే ఈ Councils కేవలం సలహాలు మాత్రమే ఇస్తున్నాయని చెప్పారు. అయితే ఈ Zonal Councils వల్ల ఉపయోగం ఎంతవరకు ఉంటుందో ఈనాడే చెప్పలేకుండా ఉన్నాం.

కొంతమంది మిత్రులు ఇతర రాష్ట్రాలలో ఉన్న ఆంధ్రులు పడుతున్న అగచాట్లను గురించి వివరించారు. సరిహద్దు రాష్ట్రాలలో ఉన్న ఆంధ్ర ప్రాంతాలను మన రాష్ట్రంలో చేర్చమని వారుకోరారు. అయితే ఒక ముఖ్య విషయాన్ని మనం ఈ సందర్భంలో గుర్తించాలి. మన ఇరుగుపొరుగు రాష్ట్రాలలో ఎంతమందో తెలుగువారు ఉన్నారు. వారు ఆ ప్రాంతీయ ప్రజలతో కలిసిపోయారు. ఈనాడు వారందరు మన రాష్ట్రంలోనికి రావాలని అనుకోవడం అంత సమంజసంకాదు.

Sri A. Bapineedu] [5th April 1956

మనమందరం భారతీయులమే. ఆంధ్ర రాష్ట్రమనేది ఒక ప్రత్యేక ప్రాంతమనేది కాదు. అయితే సరిహద్దు ప్రాంతాలలోని ఆంధ్ర ప్రాంతాలు మనకు రానక్కర లేదని నా భావం కాదు. భౌగోళికంగా మనరాష్ట్రానికి చేరువలోనున్న తెలుగు ప్రాంతాలను మన ప్రాంతంలో చేర్చమని కోరడం సబబే. దీనివల్ల ప్రజలకు ఎలాటి ఇబ్బంది లేకుండా ఉంటుంది, Administrative convenience కూడా బాగా ఉంటుందని అనుకోవచ్చు. అలాంటప్పుడు ఈ వివాదగ్రస్తమైన సరిహద్దు ప్రాంతాల విషయంలో ప్రభుత్వం సరైన శ్రద్ధ తీసుకొని మనకు రావలసిన ప్రాంతాలు రాబట్టుకోవడానికి ప్రయత్నం చేయవలసి ఉంటుంది Legislative Councils విషయంలో అవిఉండడం చాలఅవసరం అనుకుంటాను. రామకృష్ణరాజు, కాశీశ్వరరావుగారివంటి పెద్దలు, ప్రతిభావంతులు. ఊరు ఊరు తిరిగి ప్రజల దగ్గరకు పోయి వాళ్లను బ్రతిమాలుకొని ఓట్లు సంపాదించుకొని Councils లోకి వస్తే తగిన సలహాలు ఇవ్వగలరు. M L.A. కావాలంటే ప్రతి ప్రజ దగ్గరకు పోవాలి. ప్రతి ఊరు పోయి వాళ్లకు కావాలసిన పనులు చేస్తామని వాగ్దానాలు చేయవలసి ఉంటుంది. Councilలో ఉంటే వారికి మావంటి వాళ్లు ఓట్లు ఇస్తే Council లో member అవుతారు. ఏది ఎట్లా ఉన్నా Council చాలా అవసరం. అంతేకాకుండా సభ్యుల సంఖ్య 300 అవుతుంది. కాబట్టి Council కూడా చాలా అవసరము ఏర్పడబోయే మన రాష్ట్రాన్ని New State గా పరిగణించ కూడదని మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

Sri P. RAJAGOPAL NAIDU :—అధ్యక్షా, ఈనాడు చాలామంది సభ్యులు మాట్లాడినారు. వారందరూకూడ ఒక విషయాన్నిమాత్రం స్పష్టంగా వ్యక్తీకరించినారు. సరిహద్దులవిషయంలో ఆంధ్రులకు అన్యాయం జరిగినది అనే అభిప్రాయము అందరూ స్పష్టంగా వెలిబుచ్చారు. అది ఎవరూకూడ మరచిపోలేదు. ఇది ఆంధ్ర శాసనసభ్యులందరూ వ్యక్తంచేయడం చాలా సంతోషమైనటువంటి విషయం. మొట్టమొదట ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుచేస్తున్నప్పుడు, మద్రాసులో ఉన్నటువంటి ఆంధ్రప్రాంతాలన్నీ మనలో చేర్చాలని చిత్తూరుజిల్లావారు, రాయలసీమవారు, సర్కారులో ఉన్నటువంటి పెద్దలు తదితరులు పట్టుబట్టినపుడు, ఆంధ్రనాయకులు ఒకమాట చెప్పారు. మన నాయకత్వము లేనప్పుడు ఏమిచెప్పినా ప్రయోజనముండదు. మనకు ప్రత్యేక నాయకత్వం ఉన్నట్లయితే కేంద్రప్రభుత్వముతో పోరాడి మనకు న్యాయంగా రావలసిన ప్రాంతాలన్నీ తీసుకోవచ్చును అని సమాధానమిచ్చారు. కాని ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత, మనకు రావలసిన ప్రాంతాలు మనము తెచ్చుకోవడం అటుఉంచి, ఉన్నటువంటి ప్రాంతాలనుకూడ పోగొట్టుకోవడం చాలా విచారకరమైన విషయము. తప్పనిసరిగా దీనికి అందరూ విచారాన్ని వెలిబుచ్చ

వలసియున్నది. బళ్ళారివిషయంలో ఆంధ్రులకు అన్యాయం జరిగిందనేది పరమ సత్యము. ఈ అన్యాయాన్ని సవరించడానికి మన అసెంబ్లీ మంత్రివర్గము మరొకసారి ప్రయత్నించాలని నేను అభ్యర్థిస్తున్నాను.

తరువాత Boundary Commission ఏర్పాటుచేయాలని ముఖ్యమంత్రిగారి ప్రతిపాదనఉన్నది. Boundary Commission ఏర్పాటుచేసేముందు ఒకవిషయాన్ని అందరు గుర్తించుకోవాలి. Boundary Commissions ఏ ప్రాతిపదిక మీద ఈ సరిహద్దులను సవరించబోతున్నారో గమనిస్తే అది మనకు సులభంగా అర్థమవుతుంది వారు ఈ సరిహద్దుల లెక్కలమీదనే అధారపడవలసియుంటుంది. అయితే, మన చంగల్‌రాయనాయుడుగారు చెప్పినట్లు దక్షిణసరిహద్దు లెక్కలన్నీ తారుమారుచేయబడి ఆవిధంగా ఆంధ్రులకు అన్యాయం చేయబడింది. ఈ లెక్కలను ఆధారంగా చేసుకొని దక్షిణసరిహద్దులను నిర్ణయించినట్లయితే, ఏలాంటి Boundary Commission ఏర్పడినప్పటికీ, వారు మనకు న్యాయంచేయాలని ఎంత అనుకొన్నప్పటికీ, తప్పనిసరిగా మనకు అన్యాయం జరిగితీరుతుంది. కనుక ఈ లెక్కలను ఆంధ్రప్రభుత్వంగాని, ఎవరుగాని సమ్మతించకుండా ఉండాలని నేను మనవి చేస్తున్నాను. మొట్టమొదట ఈ లెక్కలన్నీ సవరించబడాలి. వీటిని సవరించిన తరువాతనే, అనగా కొత్తగా తయారుచేసిన లెక్కలప్రకారం Boundary Commission ఈ సరిహద్దుల సవరణనుచేసినట్లయితే, ఆంధ్రులకు న్యాయం జరగడానికి వీలుంటుంది. కనుక ఈ లెక్కలు కొత్తగా సేకరణచేసేదానికి ఆందోళన చేయాలని ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను.

ప్రాంతీయ సంఘాలవిషయముకూడ కొంత చెప్పదలచుకొన్నాను. తెలంగాణాను మనతో చేర్చాలని High Command చెప్పినప్పుడు, తెలంగాణా నాయకులు ప్రత్యేక తెలంగాణా కావాలని ఎంతో పట్టుబట్టినప్పటికీ, వారు సైనికులుగా క్రమశిక్షణతో, విశ్వాసంతో పెద్దలు చేసిన నిర్ణయంప్రకారం మనతో చేరడానికి ఒప్పుకొన్నందుకు వారిని మనము అభినందించవలసియున్నది. ముఖ్యంగా ఈ విషయంలో వారు ఏలాటి ఆందోళన చేయకుండా ఒప్పుకోవడం చాలా గొప్ప విషయమే. నిజంగా వారికి న్యాయం కలిగిస్తామని మనము ఎంత చెప్పినప్పటికినీ, వారికి కొన్ని భయసందేహాలున్నాయి. నిజంగా వారికి న్యాయంచేయాలని మన ఉద్దేశమైనట్లయితే, వారు కోరిన ప్రాంతీయసంఘాన్ని ఏర్పాటుచేయుటకు మనము సమ్మతించవచ్చుననుకొంటాను. దానివల్ల మనకేమీ నష్టం కలుగకపోదు పైగా వారి యొక్క మనస్సును మనము ఆకర్షించినట్లు అవుతుంది. దానివల్ల ఎక్కువ సహచర్యము

Sri P. Rajagopal Naidu] [5th April 1956

కూడ కలుగుతుంది. కనుక ఈ ప్రాంతీయ సంఘము ఉండడాన్ని మనమందరము బలపరచవలసియున్నది.

తరువాత High Court విషయంలో చాలామంది చెప్పారు. హైదరాబాదులోనే High Court ఉండడం మంచిది. ఇంకొక ప్రత్యేక Bench పెట్టాలనుకున్నట్లయితే దానిని ఎక్కడ పెట్టాలనే విషయంలో ఘర్షణకు దారితీస్తుంది. పైగా అటువంటిది అవసరంలేదని నేను అభిప్రాయపడుతున్నాను.

ప్రాంతీయసంఘాలు nominations మూలకంగా జరుగుతున్నాయి గనుక, అవి సలహాసంఘాలుగా మాత్రమే ఉండవలసియున్నది. అవి nominations మీద జరుగుతూ ఉండేంతవరకు, వాటికి Statutory powers ఉండకూడదని నేను అభిప్రాయపడుతున్నాను.

*SRI D. VENKATARAMANA REDDI :—అధ్యక్షా, భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్నిర్మాణం జరిగినప్పుడు అది దేశంలో ఒక ఉజ్జ్వలమైనటువంటి ఘట్టమని చెప్పుకోవాలి. ఆంధ్ర, తెలంగాణా విలీనీకరణ ఏర్పడి ఆంధ్రులందరిని ఒక ప్రభుత్వముక్రింద తెచ్చి ఏకముచేస్తున్నటువంటి ఈ నిర్ణయం కలకాలము మరచిపోయేటటువంటిది కాదు. ముఖ్యంగా మనము శాసనసభ్యులుగా వున్నటువంటి ఈ తరుణంలో ఇటువంటి చరిత్రాత్మకమైన బిల్లు చర్చించడం మన అదృష్టమనే చెప్పాలి. పునర్నిర్మాణం జరిగినటువంటి మన రాష్ట్రము ఇండియాలో ఉన్నటువంటి పెద్ద రాష్ట్రాలలో మూడవదిగా లెక్కకు వస్తుందని చెప్పుతున్నారు. అట్లాంటి పెద్దరాష్ట్రముగా ఉన్నటువంటి మనకు Upper. House అనగా Council అనేది వుండడం అవసరమని నేనుకూడ అభిప్రాయపడుతున్నాను.

ఆంధ్ర తెలంగాణా విలీనీకరణతో రూపొందగల రాష్ట్రానికి "ఆంధ్ర తెలంగాణా" అనే నామకరణంచేశారు. ఆ పేరు అంత సవ్యమైనటువంటిది కాదని పెద్దలందరూ దానిపేరు "ఆంధ్రప్రదేశ్" అని వుండాలని చక్కగా తీర్మానంచేశారు. "ఆంధ్రప్రదేశ్" అనేది మనకు తగి వున్నది కనుక ఆ నామకరణమే చేస్తే బాగుంటుందనుకొంటాను. కాని నిన్న మన ముఖ్యమంత్రిగారు సెలవివ్వడంలో, తెలంగాణావారు మన రాష్ట్రంలో చేరడానికి ఎన్నో పేచీలు పెట్టుకొని వారికి కావలసిన వర్గములను సంపాదించుకొనికూడ, ఆంధ్రప్రదేశ్ అని పేరు పెట్టుకొనేనాంట్లో సయితేము ఒప్పుకొనేందుకువారు తటపటాయించడం అంత గొప్పతనమనిపించుకోదు అని చెప్పారు. వారు దీనిని అంగీకరించడంలో వారి గొప్పతనం ఋజువు అవుతుంది తప్ప ఇంకొకటికాదు,

5th April 1956] [Sri D. Venkataramana Reddi

కొత్తరాష్ట్రానికి High Court ఎక్కడ ఉండాలనేవిషయంలో, గుంటూరులో ఒక Bench హైదరాబాదులో ఒక Bench పెట్టవలసినట్లుగా తెలంగాణా మిత్రులు కోరుతున్నారు. అది ఎంతమాత్రము సబబైనటువంటిదికాదు. హైదరాబాదులోనే High Court వుండడం మంచిది. కావాలంటే ఒక Urdu Bench హైదరాబాదులోనే ఏర్పాటుచేసుకోవచ్చు,

కొత్తరాష్ట్రములో ఎన్నికలనుగురించి ప్రస్తావిస్తూ, 1957 లో తెలంగాణాలో మాత్రం ఎన్నికలు జరుగవలెనని, తిరిగి ఆంధ్రతెలంగాణా మొత్తానికి 1960 లో ఎన్నికలు జరుగవలెనని బిల్లులో పేర్కొనబడింది. 1957 లో తెలంగాణాకు ఎన్నికలు జరిపితే, 1962 వరకు వారు వుంటారు కాబట్టి మన అసెంబ్లీ ఎన్నికలు 1962 వరకు పొడిగింపుచేసి, దేశమంతటితోపాటు మనకుకూడా 1962 లో ఎన్నికలు జరిగితే బాగుంటుంది.

ప్రస్తుతము మైసూరులో వున్న బళ్ళారి, మరికొన్ని తెలుగుభాగాలు ఆంధ్రరాష్ట్రములో చేర్చవలెననే కనీసపు సిఫార్సులను కేంద్రప్రభుత్వము అంగీకరించనందుకు మన మిత్రులందరూ చాలా విచారము వెల్లడించారు. ఈ విషయములో మన నాయకులు కృషిచేసినారు, అయినా ప్రయోజనములేకపోయింది. ఒకసారి ఒక నిర్ణయంచేసినతరువాత తిరిగి దానిని మార్చుటకు వీలుకాదని కేంద్ర ప్రభుత్వము వారు ఆ నిర్ణయాన్ని మార్చుటకు ఒప్పుకోలేదని మన ముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు. ఏమైనప్పటికినీ, ఇప్పుడు ఈ Boundary Commission ద్వారానైనా ఇతర చోట్ల మిగిలిపోయిన ఆంధ్రప్రజలను ఆంధ్రప్రాంతాలను మనలో కలపడానికి మరొకసారి తీవ్రంగా కృషిచేయవలెనని కోరుతున్నాను.

*SRI B. APPA RAO :—అధ్యక్షా, భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ బిల్లు మీద చర్చ యిప్పటికి మూడుదినములుగా జరిగింది. ఈదినము చర్చ నాల్గవరోజది. ఈ బిల్లుపైన మనమిత్రులు తమ ఆనందాన్ని, మహానందాన్ని ప్రకటించారు. స్వాతంత్ర్య పోరాటములో ఒకభాగమైన భాషాప్రయుక్తరాష్ట్ర విభజన సమస్యలో మనము ఏమూలసూత్రాలనైతే ఏర్పాటుచేసుకున్నామో, ఆ మూలసూత్రాల ననుసరించి, యీ పోరాటముతో సంబంధము కలిగినవారికి కొంతమటుకు సంతృప్తిని కలుగజేస్తుందేమోగాని, ఆసమస్య పూర్తిగా పరిష్కారమైందనిమాత్రము మనము అనుకోటానికి వీలులేదని నా అభిప్రాయము ఆ మూలసూత్రాలనుబట్టే మనదేశము యొక్క బార్డరు సమస్య వచ్చేసరికి, అది జనవాక్యనిర్ధారణద్వారా పరిష్కారము చేసుకుందాము అని మన గాంధీమహాత్ముడు చెప్పినందువల్ల, దానికి మన భారతదేశ

Sri B. Appa Rao] [5th April 1956

మంత్రియు కట్టుబడియున్నది. పెద్ద పెద్ద నాయకులందరుకూడ ఆ విషయాన్నే గుర్తించారు. కాని ఈనాడు అధికారములో వుండే మహా నాయకులు ఆ మూలసూత్రమును విస్మరించి, పెడమార్గానకు నడుపుతున్నారు. ఒక్క విషయము మీదృష్టికి తెస్తున్నాను. ప్రథమప్రపంచ సంగ్రామానంతరము అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు దేశములు మూడు, తదితర మిత్రరాజ్యాలు అన్నీకలిసి యూరపుదేశములో గీతలు గీశారు. ఆ గీయడములో డాంజిగ్ సమస్య ఉత్పన్నమైంది. దానితో యూరపు దేశమంతా మరల అల్లకల్లోలమై ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామమువచ్చింది. ఈనాడు యీ S. R Bill అమలుపరచడములో అటువంటిది మన దేశములో రాకపోదు. భాషారాష్ట్రాల నిర్మాణసమస్య పరిష్కరించే సమయములో పమ్ము అయిపోవటానికి దేశములో మరల అల్లకల్లోలములు జరగటానికి ఆస్కారము కన్పిస్తున్నది. ఆ విషయాన్ని మనము విస్మరించలేము. కడుపు నిండిన వాడికొకభాష, నిండనివానిది మరొకభాష, అనే తత్వంతో మనము యిక్కడ మాట్లాడుకుంటే కాదు. ఈ సమస్యను కూలంకషంగా పరిశీలన చేసుకుని పరిష్కరించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడ్డది. ఆర్థిక పురోగమనానికి ప్లానింగు దేశములో ఉండేటప్పుడు, యిది అప్పుడప్పుడు దేశానికి ఒక తలనొప్పిగా పరిణమించగాదు. దేశములో భూమిసమస్య వున్నది. అట్లాగే మనకు బార్డరుసమస్యలున్నవి. పర్లాకిమిడి విషయము ఆలోచనకువస్తే డాంజిగ్ అని మనము చెప్పలేమా? అలాగే మనకు వుండకున్న బరంపురము సమస్యను గురించి ఆలోచిద్దాము. ఇవి ఆనాడు బ్రిటిషు సామ్రాజ్యవాదులు కలిపించినటువంటివి. అప్పుడు జనాభాలో మెజారిటీగా ఉన్న బరంపురం, ఆంధ్రదేశానికి విజ్ఞాన భిక్ష పెట్టినటువంటి బరంపురము, ఆంధ్రుల పరిపాలనలో ఉన్న బరంపురము వేగిచుక్క గ్రంథమాల అనే గ్రంథమాలద్వారాగాను, యితర గ్రంథమాలలద్వారాగాను అక్కడనుంచి ఆంధ్రకు విజ్ఞానాన్ని వెదజల్లినటువంటి బరంపురవాసులకు, యీ ప్రభుత్వము ఆ విషయము ఆలోచించక పోవడము, ఏమనిపించుకుంటుంది? మెజారిటీగా ఉన్నటువంటిది మైనారిటీగా మారిపోలేదా? అది న్యాయమేనా, అని అడగవచ్చునా? మనమందరమూ భారతదేశములోనే ఉంటున్నాముగదా అని సమాధానము చెప్పవచ్చు. కాని ఒక్క విషయము మాత్రము చెప్పకతప్పదు. ఏమిటంటే, ఈ భాషారాష్ట్రాల విషయములో ఆంధ్రులకు మహారాష్ట్రులకు చాలా అన్యాయాలు జరిగినవి. ఇది గంగాపానీ పవిత్రమైనటువంటి దృక్పథము. కేంద్రములోనే ఉందని నిస్సంకోచముగా ఒప్పుకోక తప్పదు. అలాగుననే మన పొరుగుననున్న ద్రావిడులైనటువంటివారి యొక్కయు, అటుప్రక్కన ఉన్నటు

5th April 1956] [Sri B. Appa Rao

నంటి కర్నాటక మిత్రుల యొక్క సహకారము, influence తో కేంద్ర ప్రభుత్వములో ఉన్న గంగాపాపి పవిత్రమైనటువంటివారి దృష్టి యీ మధ్యనున్న రెండు జాతులవారిమీద పడ్డదని చెప్పకతప్పదు. అన్యాయము లేకుండా సరియైన పరిష్కారము చేస్తే, అల్లర్లు యేమీ ఉండవు. అన్యాయము ఏమీ ఉండదు. మనకు ఏదో పరిష్కారము అయిందనిచెప్పి, పరిష్కారముకాని వారిని దృష్టిలో పెట్టుకోకుండా ఉండడము తగదు. లోగడ దేశానికిగూడ కొంత హెచ్చరిక చేసియున్నాము. పనిచేసియున్నాము. కాంగ్రెసు మహాసంస్థద్వారా యీ ఉద్యమమును మనము ముందుకు తీసుకొనివెళ్లాము. కొన్నితీర్మానములు గూడ చేసియున్నాము. దానికి మన బాధ్యత ఉన్నది. ఈ సమస్యను కేంద్రప్రభుత్వము వారుగాని తదితర మంత్రులు గాని, యిత్యాది న్యాయమూర్తులుగాని పరిష్కారముచేయలేరని నా విశ్వాసము. ఈ సమస్య పరిష్కారము కావాలంటే ఒక్కటే మార్గము ఉన్నది. ఆప్రాంతాలను జనవాక్య నిర్ధారణకు వదిలివేయమనండి. అంతర్జాతీయ విఖ్యాతిగాంచిన మహానాయకుడగు ప్రధాని నెహ్రూ పరిపాలిస్తున్నయీ భారతదేశములో, అంత పెద్ద ప్రజాస్వామికవాది అని చెప్పబడుతున్న ఆ మహోత్తరనాయకునివల్ల యీ సమస్యను పరిష్కారముకాదా అని అడుగుతున్నాను. ఈ సమస్యను ప్రజాపరిష్కారానికి వదిలితే, ప్రజలే యీ సమస్యను పరిష్కారము చేసుకుంటారు. అప్పుడే ఇది పరిష్కారమవుతుంది. తగాదాలు సమసిపోతాయి అంతవరకూ యీ తగాదాలు పరిష్కారముకావు. ఇది రావణాసురుని కాష్టములాగా వెలుగుతూ ఉండవలసిందేగాని, దానికి మాత్రము ఎప్పుడూ గూడ విముక్తిఅనేది ఉండదు. ఈ సమస్య ఎప్పుడూకూడ నిలవబడే ఉంటుందనే విషయము మాత్రము దృష్టిలో పెట్టుకోవాలి. మరొక విషయము మనవి చేయదలచుకున్నాను. మీరు మధ్యప్రదేశ్ వెళ్లి, రాయపూరులో బస్సుఎక్కి జగ్దయాల్‌పూరు చేరుకుని ఆ ప్రాంతము చూస్తే, అక్కడ ఎక్కడచూచినా తెలుగువారే కన్పిస్తారు. అది బస్తరు జిల్లా. అక్కడ ప్రజలు తెలుగు భాషనే మాట్లాడుతారు. ఇక్కడ దూరముగాఉండి విన్న విషయము అటుఉంచి, స్వయముగా వెళ్లిచూస్తే అన్ని విషయములు గోచరమవుతాయి. ఆనాడు జమీందార్ల కాలముగాఉండినప్పుడు ప్రభువు ఒకరు, ప్రజలు యింకొకరు కావచ్చు. ప్రభువు ఎవరైనను అక్కడ నివసించే ప్రజలు అందరూకూడ తెలుగువారే. అట్లాగే యిక్కడ గుణుపూరు సమస్య ఒకటిఉన్నది. అటు గంజాము జిల్లాలోని చిలకనుంచి, చెన్నగరమువరకు ఇటుచాందానుంచి సేలంజిల్లావరకూ, మరొకవైపున రాయలసీమ అనే రత్నాలసీమ అని పిలవబడే బళ్లారినుండి బెంగు

Sri B. Appa Rao] [5th April 1956

షూరువరకు ఎక్కడ చూచినా ఆంధ్రులు అని విన్పిస్తున్నప్పుడు, యీ ప్రాంతాలు ఆంధ్రలో కలియనిచో, ఆంధ్రజాతి నిద్రించదు. ఇవి కలియకుండా ఆంధ్రులను నిద్రపొమ్మని అంటే నిద్రపోతారా? నాయకులనే చెప్పమని అంటున్నాను. మన మందరము ఉండేది భారతదేశములోనేగదా అని మన ముఖ్యమంత్రి గోపాలరెడ్డి గారు నిన్ననో మొన్ననో అన్నారు. అయితే నేను అడిగేది, మనకు యివ్వవలసింది పూర్తిగా యిచ్చారా? మనకు యివ్వవలసింది యివ్వకపోతే, నిద్ర ఎట్లా పోగలుగుతాము? ఏ ఆశయాలకు మనము యిన్నాళ్లుగా కామకోనియున్నాము? ఏ ఆశయాలను గురించి యిన్నాళ్లుగా అక్కడప్రజలకు చెబుతూవచ్చాము? అక్కడ ప్రజలకు చేసిన వాగ్దానములు యేమిటి? అందులో ఏదైనా ఫలించినవా? అవి అన్నీ సాధించకుండా, శాంతించండి అని చెబితే, ఎట్లా శాంతించగలుగుతాము? బాగ్దర్సులో ఉండేవారు ఎట్లా శాంతించగలుగుతారు? వాళ్లు యితరరాష్ట్రాల చేతులలో చిక్కి నానా కష్టాలుపడుతున్నారే, అవి ప్రభుత్వదృష్టికి తేలేదా? అవన్నీ ప్రభుత్వం విస్మరించిందా? ఈ విషయాలన్నీ మనము ఆలోచించాలి. మనకోర్కెలు సక్రమమైనవా, అక్రమమైనవా, అనేది యితరులు ఎవ్వరూ నిర్ణయించనక్కరలేదు. ఈ సమస్యాపరిష్కారము ఆంధ్రప్రజలకు వదిలితే, ఆ పరిష్కారము వాళ్ళే చేసుకుంటారు. కాబట్టి దీనిని స్వయం నిర్ణయాధికారానికి విడవండి. అప్పుడు ఏ ప్రాంతము ఎవరిదో తేలిపోతుంది. మనమందరము కేంద్రప్రభుత్వానికి లోబడే ఉంటున్నాము. మనది పాకిస్తాన్ వాదనలాంటిదికాదు. కేంద్రప్రభుత్వము యొక్క అధికారానికి లోబడే మనము స్వయం నిర్ణయహక్కును కోరుకుంటున్నాము. కేంద్రప్రభుత్వమును విడిచిపెట్టి ఎక్కడికో పైదేశము పోదామని గాని, కేంద్ర ప్రభుత్వానికి లోబడివుండము అనిగాని, మనము చెప్పడములేదు. మనకు జరిగింది ఖచ్చితముగా అన్యాయమే. ఈ అన్యాయమును మనము యిప్పుడు సవరించుకోవలసి యున్నది. ఒక విషయము నాకు జ్ఞాపకమువచ్చింది. నిన్ననో మొన్ననో మన ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు, ఆంధ్రప్రభుత్వము చేయగలిగిన ప్రయత్నము అంతా చేసిందని అన్నారు. అయితే ఫలితము శూన్యముకాలేదా? గతప్రపంచ మహా సంగ్రామసమయములో బ్రిటిషు సామ్రాజ్యవాదులు సైన్యములనుగురించి ప్రజలకు broadcast చేస్తూ ఉండేవారు. ఏమని అంటే, మనసైన్యాలు బహుపరాక్రమములో ముందుకుసాగి, అతిసాహసముతో వెనుకకు తగ్గినవని, broadcast చేసేవారు. అట్లాగే ఈ ప్రభుత్వము అతిసాహసముతో ప్రయత్నించిందిగాని ఫలితము శూన్యముగా తిరిగివచ్చినట్లుగా ఉన్నది. ఇందులో అందులో మాకు భేదా మేమీ కన్పించడములేదు. ఇది మనము ఖచ్చితముగా ఒప్పుకోకతప్పదు.

5th April 1956] [Sri B. Appa Rao

తెలంగాణావారితో మనకు యిప్పుడు కొన్నిసమస్యలు ఉన్నవి. అవి మనము, వారు పరిష్కరించుకోవలసియున్నది. ఆ విషయములో నేనేమీ చెప్పదలచుకోలేదు. అవి పరిష్కరించుకునేవిషయములో మన నాయకులమీద మాకు full confidence ఉన్నది. మన నాయకులు అన్యాయముచేయబోరని మన తెలంగాణా మిత్రులకు అభయహస్తము యిచ్చారు. కాబట్టి వారు చేయబోయే నిర్ణయాలకు మేము కట్టుబడి ఉండవలసిందే. వారు పరిష్కారము చేసుకునేటంతవరకు మేము ఏవిధమైన ఆటంకాలు కలిగించగూడదు అనేభావము మాకు ఉన్నది. అందులో మేము interfere కాదలచుకోలేదు అని మనము ఖచ్చితముగా చెప్పవలసియున్నది. కాని బార్డర్సు విషయములోనే మనకు జరగవలసినంత అన్యాయముమాత్రము జరిగింది. బార్డర్సులో ఉన్న ఆంధ్రులందరూ ఎంతో శాంతియుతంగా అంతా బాగానే న్యాయముజరుగుతుందని వేచియున్నారు. కాని, న్యాయము జరగలేదు. ఈ విషయములో వారియొక్క భావాలు ఎట్లా ఉన్నవో ప్రభుత్వం తెలుసుకోవాలి. ఇక్కడ మనరాష్ట్రములో అంతో, ఇంతో యిల్లు వాకిలి గలిగియుండి, యిక్కడికి అసెంబ్లీసభ్యులుగా వచ్చినవారు ఆ ప్రాంతాలకు ఒకపర్యాయము వెళ్ళిచూస్తేనే గాని, అక్కడ ఉన్న ఆంధ్రులయొక్క అభిప్రాయాలు భయాందోళనలు ఏవిధముగా ఉన్నవో చూస్తే గ్రహించగలుగుతారు. ఊరకనే యిక్కడ కూర్చుని ఊహించితే, అవి సామాన్యముగా అర్థముకానేరవు కమ్యూనిస్టుపార్టీకి ఒక బాధ్యతమాత్రం ఉన్నది. బళ్ళారివిషయములో వారుమాత్రము చాలా గొప్ప తప్పు చేశారు అని నేను ఖచ్చితముగా చెబుతున్నాను. వారిపార్టీ అభిప్రాయాన్నే డాక్టరు అధికారి అనే బుక్కులోగాని, సుందరయ్యగారు వ్రాసిన "విశాలాంధ్ర" లో, "ప్రజారాజ్యం" లో గాని బళ్ళారిని కర్నాటకులకు దానంచేశారు. ఆనాటినుంచి యీ నాటివరకూ బళ్ళారిలోవున్న ఆంధ్రులను మనలో చేరకుండా చేసింది యీ కమ్యూనిస్టుపార్టీవారే. ఈ అన్యాయమంతా చేసింది వారేనని చెప్పకతప్పదు. ఆ బాధ్యత వారిదేనని వారు ఒప్పుకోక తప్పదు. వారుచేసిన అన్యాయమును వారి చర్యలే బుజువుచేస్తున్నవి. భారతదేశములో మనకు కొన్ని ఆశయాలు ఉన్నవి. ఇవి యిప్పటినుంచేకాదు. గాంధీజీ జిన్నాలమధ్య జరిగిన correspondence న్నూ, పాకిస్తాన్‌వారికి రాజేంద్రబాబుకు మధ్య జరిగిన correspondence న్నూ, తరువాత నెహ్రూకు జిన్నాకు మధ్య జరిగిన correspondence న్నూ, అంతా చదివితే, మన నాయకులు జనవాక్యనిర్ధారణకు చాలా weight యిచ్చారు. ఆ సిద్ధాంతానికి మన ఆంధ్రులు కట్టుబడివుంటారు. భాషారాష్ట్రోద్యమములో జనవాక్య నిర్ధారణకు ప్రాముఖ్యము యిస్తూవచ్చారు. దానితో యీ బార్డర్సు సమస్యలు

తేల్చుకుంటే, యిందులో ఎవరూ కూడ శిఖపట్లు పట్టుకోనవసరము ఉండదు. మన దేశమును మనము పాడుచేసుకోనవసరం లేదు. ఇరుగు పొరుగు రాష్ట్రాలతో సామరస్యము సంపాదించుకొనటానికి వీలవుతుంది. ఆంధ్రరాష్ట్రము, ఆంధ్ర ప్రభుత్వము శక్తివంతమై, వివేకవంతము కాగలదు. ఈ ప్రభుత్వానికి మరొక బాధ్యతకూడ ఉన్నది. మన రాష్ట్రానికి చాలా పెద్ద బార్డరు ఉన్నది. సరిహద్దులు ఉన్నవి. సరిహద్దు పొడుగునా మనకు యీ సమస్య ఉంటూనేవున్నది. కాబట్టి దురదృష్టవశాత్తు మనకు ఉండుకున్న సంపదలన్నీ సరిహద్దులలోనే ఉన్నవి. తూర్పు భాగములోగాని, దక్షిణభాగములోగాని, పశ్చిమభాగములోగాని మనకు ఉన్నటువంటి ప్రాంతాలు రాకుండా బైటనే నిలబడిపోయినందున, మనము ఆ సంపదలు ఉపయోగించుకోలేకపోతున్నాము. అవి మనము చేరదీసుకోటానికి ప్రభుత్వము ఎక్కువగా కృషి చేయాల్సి ఉన్నది ఈ సమస్యలన్నీ జనవాక్యనిర్ధారణద్వారానే తేల్చుకోటానికి కేంద్రప్రభుత్వాన్ని ఒప్పించగలిగితే, అది చాలా సంతోషించదగ్గ విషయమవుతుంది ఆ నాడే మనకు సంపూర్ణ ఆంధ్రరాష్ట్రము ఏర్పడ్డదని చెప్పుకోవచ్చు. ఆ నాడే మనకు సుదినమవుతుంది. ఆ నాడే మనము మన ప్రభుత్వాన్ని అభినందించగలుగుతామని నా నమ్మకము. ఈ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షుల వారికి నా కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తున్నాను.

Sri D. KONDAIAH CHOWDARY :—అధ్యక్షా, ఈ States Reorganisation Bill విషయములో మన ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన తీర్మానాలతో నేను ఏకీభవిస్తూ రెండు ముఖ్యమైన విషయాలు మాత్రము మనవి చేయ దలచుకున్నాను. ఈ తీర్మానాలలో మన నూతన రాష్ట్రానికి Legislative Council ఏర్పాటును గురించి తెలుసుకున్నాను. కమ్యూనిస్టులు, సోషలిస్టులు దీనిని వ్యతిరేకిస్తున్నారనిగూడ తెలుసుకున్నాను. Legislative Council ఉండాలి అని చెప్పేవారిలోనూ అది కావాలని కుతూహలము కలవారిలోనూ నేను ఒకణ్ని. కాని వారు యీ విధముగా దానిని గురించి తీవ్రమైన నిరసన, వ్యతిరేకత చూపిస్తారని నేను అనుకోలేదు. వారు చెప్పిన ప్రధానమైన విషయాలనుబట్టి యీ కౌన్సిలు ఉండడము బొత్తిగా యిష్టములేదని తెలుస్తున్నది. అయితే వారుమాత్రము యీ నిరసనవల్ల వారియొక్క బలహీనతనే exhibit చేసుకుంటున్నారేగాని, మరేమి కన్పించడములేదు. Legislative Council యొక్క స్వభావము చూస్తే, అందులో 24 మంది శాసనసభ్యులు, 24 మంది. లోకల్ బోర్డులకు మునిసిపాలటీలకు జిల్లాబోర్డులకు సంబంధించినవారు, మరొక 12 మంది teachers కు సంబంధించిన వారు, యింకొక 12 మంది nominated వారు ఉంటారని తెలుస్తున్నది. అలాంటి

పరిస్థితులలో, యీ రోజున కాకపోతే, మరొకరోజుకైనా మేము మెజారిటీ సంపాదించగలుగుతాము అని వ్యతిరేక పక్షసభ్యులు చెబుతున్నారు. పైగా క్రిందటి ఎలెక్షన్సులో కూడ మేమే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయబోతాము అని డాబులు కొట్టారు. మరల యీ రోజున కాకపోతే రేపైన ప్రభుత్వములోకి వచ్చేవారమేనని ఆర్భాటము చేస్తున్నారు. వారికి అంతటి ధైర్యము ఉన్నప్పుడు, ప్రభుత్వములో వారు అంతటి మెజారిటీ సంపాదించగల ధీమా ఉన్నప్పుడు ఎన్నికకాబోయే 24 మందిలో మెజారిటీవచ్చే మెంబర్లను ఎన్నుకునే అవకాశము ఉంటుందిగదా! కాబట్టి దానిని గురించి వారు భయపడవలసిన అవసరముఉండదు.

ప్రజలతరపున మాట్లాడే ధీమా మాకేయున్నది, ఏదోగుత్తకార్లు పెట్టుబడిదార్ల భూస్వాములుఅని చెబుతూఉంటారు. ప్రజలలో మాకే ఎక్కువపలుకుబడి ఉన్నది, మేమే ప్రజలు, ప్రజలే మేము, అనేదృష్టిలో మాట్లాడుతున్నప్పుడు, ఈ Local authorities నుంచి వచ్చేసభ్యులద్వారా ఎన్నుకోనేటటువంటి మిగతా 12 మంది మాత్రం ఎందుకు రాకూడదని నేనడుగుతున్నాను. మిగతా 12 మందిలో ఆరుగురు Teacher లు, ఆరుగురు Graduates ఎన్నుకునేవారన్నప్పుడు అందులో వారికి చిక్కుగా ఉంటుందని అనుకుంటున్నారు. అదే నా నమ్మకంకూడా. ఎందువల్లనంటే విజ్ఞానవంతులున్నటువంటి, విద్యాధికులున్నటువంటిచోట వారిని ఎప్పుడూ ప్రేమించరు. వాళ్లకు ఓటుఇవ్వరు. ఐతే ఇంకొక విషయంకూడా మనం గమనించాలి. వారు చెప్పేసిద్ధాంతాలు మంచివైతే, Graduates, Teachers వాళ్లకు ఓటిచ్చి వాళ్లనే ఎందుకు ఎన్నుకోరు? మిగతా 12 మంది గవర్నరు గారిచే Nominate చేయబడతారు, అంటే ప్రభుత్వం తరపునే Nominate చేయబడతారు. ఈ రోజు కాకపోయినారేపైనావారు ప్రభుత్వంలోకివస్తే గవర్నరుద్వారా ఆ 12 మందినీ కూడా వారే Nominate చేయించుకోడానికి అవకాశంఉంది. కాబట్టి ఈCouncil constitute చేసేపద్ధతి చూచి వారు భయపడవలసిన అవసరంలేదు. ఈ విషయంలో ఒకటిమాత్రం ప్రభుత్వానికి నేను మనవిచేస్తున్నాను. అసలు Constitution లో "The remainder shall be nominated by the Governor" అని ఉన్నది. ఇక్కడ remainder అంటే నూటిలో 16 వ భాగం 12 వస్తుంది. ఇది ఏమంత సమంజసంకాదు. ఇంత హెచ్చుమందిని గవర్నమెంటు nominate చేయడం న్యాయంకాదు. అందువల్ల ఈ nominate చేయబడే సభ్యులసంఖ్య 12 నుంచి 6 కి తగ్గిస్తే బాగుంటుంది. లేకపోతే nominated సభ్యులసంఖ్య చాలా ఎక్కువ భాగంఉంటుందని గవర్నమెంటువారి దృష్టికి తీసుకువస్తున్నాను. Legislative Council ను గురించి భయపడవలసిన అవసరం

Sri D. Kondaiah Chowdary] [5th April 1956

Communist party కి ఏమాత్రంలేదు. వాళ్లనుకూడా దీనితో ఏకీభవించవలసినదని కోరుతున్నాను. ఏ రాష్ట్రానికైనా Legislative Council ఉండడానికి అర్హత లేదేమోగాని, ఆంధ్రరాష్ట్రానికి మాత్రం Legislative Council ఉండితీరాలి మన రాష్ట్రంలో మంచికిగాని, చెడ్డకుగాని అతివాద ధోరణిలో ఉంటున్నాం. ఒక time లో Communist లకు ఎక్కువ ఓట్లుఇచ్చి గెలిపించాం మళ్ళీ ఇంకొకసారి కాంగ్రెసువాళ్లను ఎక్కువ వోట్లిచ్చి గెలిపించాం. ఈ రకంగా ఆంధ్రదేశంలో రాజకీయవాతావరణం అస్థిమితంగా ఉంటోంది. అమిత ఉద్రేక స్వభావం కలవాళ్లం. మనంతినే ఆహారాన్నిబట్టి మనకు ఉద్రేకం కలుగుతుంది. మన ఉద్రేకస్వభావంచేత illconsidered and hasty legislation జరగడానికి అవకాశం ఉంటుంది కాబట్టి, భవిష్యత్తుకు కావలసిన అనేక ముఖ్యమైన శాసనాలు చేస్తూఉంటాం ఈ ఉద్రేకస్వభావంచేత ఒకనాడు చేసినశాసనం మర్నాడు మార్చవలసిన పరిస్థితి ఏర్పడుతూఉంటుంది కాబట్టి, ఈ ఉద్రేకంలో ఎటువంటి శాసనాలు చేసినప్పటికీకూడా దేశానికి ప్రమాదకరంగా పరిణమించకుండా, అనుభవజ్ఞులైన విజ్ఞానవంతులతో కూడి ప్రశాంత వాతావరణంలో పరిస్థితులను పూర్ణంగా సమీక్షించి న్యాయమైన శాసనాలను pass చేయడానికి Legislative Council చాలా అవసరం. మనదేశంలోనే కాకుండా అమెరికా రాష్ట్రాలలోకూడా ఇదే జరుగుతోంది. America అంటే Communist లు జగడం వేస్తారు. కాబట్టి ప్రతి దేశంలోనూ రెండు సభలుంటున్నాయి. దానివల్ల ఎక్కువ ఖర్చేమీకాదు. ఎందువల్లనంటే ఒక శాసనం త్వరపడిచేసి, ప్రజలలో కొంత గందరగోళం లేవదీసి, High Court కుపోతే ultra vires అనిపించుకునో, మరి ఇంకో విధంగానో అది పరిణమించి ఆరకంగా కొంత డబ్బు దుర్వినియోగం చేయడంవల్ల ఎక్కువ అరిష్టాలు కల్గుతాయికాని, కొంత డబ్బు ఖర్చయినప్పటికీ, కొన్ని రోజులపాటు దీర్ఘంగా అనుభజ్ఞులు, విజ్ఞానులు, గొప్ప మేధావులు ఒక శాసనం సమీక్షచేసి, ఒక విధమైన balanced శాసనాన్ని చేస్తే, దానివల్ల భవిష్యత్తులో ఎక్కువ మేలు కల్గుతుంది కాని ఉద్రేక స్వభావంచేత రోజుకొక శాసనం చేసుకుంటూ దాన్ని మర్నాడు రద్దుచేసుకుంటూ పోతే ప్రజా జీవితంలో security గాని, stability గాని లేక చాలా కష్టాలు ఏర్పడతాయి. దిగువ శాసన సభలో మెజారిటీ ఉన్నా, ఎగువ శాసన సభలో మెజారిటీ ఉండకపోతే తీసుకురాబోయే సంస్కరణలకు అవరోధం ఏర్పడుతుందనే భావం కమ్యూనిస్టు పార్టీ సోదరులలో ఏర్పడనవసరం లేదు. హైదరాబాదు శాసన సభ్యులూ, మనంకూడా Council కావాలంటున్నాం. కాబట్టి, దీనికి Communist సోదరులు అవరోధం కల్పించకుండా రాష్ట్ర పురోభి

5th April 1956] [Sri D. Kondaiah Chowdary

వృద్ధిని కాంక్షించి దీన్ని సమర్ధించవలసిందని వారిని కోరుతున్నాను. హైకోర్టు విషయంలో అక్కడొక Bench, ఇక్కడొక ప్రధాన కేంద్రం ఉండడం చాలా అన్యాయం. నేను ముఖ్యంగా lawyer గా మాట్లాడుతున్నాను. ఇది Bill కు మరీ బాధాకరంగా ఉంటుంది. రాయలసీమను హైదరాబాదు హైకోర్టు ప్రధాన కేంద్రంతో ముడిపెట్టి సర్కారు ఆంధ్రులకు గుంటూరులో ప్రత్యేకమైన Bench పెడితే గుంటూరు హైకోర్టులో practice చేస్తున్న అనేక మంది రాయలసీమ లాయర్లకు చాలా అన్యాయం జరుగుతుంది. వారు Circar జిల్లాలలో కొంత practice సంపాదించారు. రాయలసీమలో వారికి ఎక్కువ practice ఉంది. వారు హైదరాబాదుకుపోతే, సర్కారు జిల్లాలలో వారికి ఉండే practice పోతుంది. వారు అక్కడకూ ఇక్కడకూ తిరగడం చాలా బాధాకరంగా వుంటుంది. అక్కడ ఒక Bench, ఇక్కడ ఒక కేంద్రం అంటే పరిపాలనా సౌష్ఠవానికి భంగంగా ఉంటుంది. కాబట్టి అంతా ఒక చోటనే వుండడం న్యాయం. హైదరాబాదులో ఉండే Lawyers, ఇక్కడనుంచి lawyers పోతే, తమకు fees తగ్గిపోతుంది అని గాని మాది ఉర్దూ భాష కాబట్టి వారితో పోటీ చేయలేమనిగాని సందేహపడ నవసరంలేదు. క్రమేపీ 4, 5 సంవత్సరాలలోపల అంతా సర్దుకుంటుంది. ఒకవేళ fees తగ్గితే ప్రజలు సుఖపడతారు. ఎక్కువ fees లు గుంజేదానికంటె, తక్కువ fees పుచ్చుకుంటే, రైతులు వారి తగాదాలు పరిష్కరించుకోడానికి ఇంకా ఎక్కువగా కోర్టుకు పోతారు. ఎక్కువగా పని ఉంటుంది లాయర్లకు. అందువల్ల రెండు కేంద్రాలు లేకుండా హైకోర్టు యావత్తూ Hyderabad లోనే ఉండే టట్లుగా చూడవలసిందని మనవి చేస్తున్నాను.

SRI M. POTU RAJU :—అధ్యక్షా! ముఖ్య మంత్రిగారు పెట్టిన బిల్లును నేను బలపరుస్తున్నాను. మన ప్రాంతంలో చేరవలసిన బళ్ళారి, పర్లాకిమిడి వగైరా ప్రాంతాలు మన రాష్ట్రంలో కలపకుండా వున్నందున అందరికి చాలా బాధగా ఉన్నది అందువల్ల ఆ ప్రాంతాలు ఆంధ్ర రాష్ట్రంలో చేరేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది. సుమారు 4, 5 రోజులనుంచి బళ్ళారి తాలూకా నుంచి ప్రజలు కర్నూలువచ్చి ఇక్కడ భత్యాలు పెట్టుకుని అవస్థపడుతూ బళ్ళారిని ఆంధ్రలో కలపవలెనని గోలపెడుతున్నారు. వారట్లా దుఃఖ పడడం మనకు ఏ మాత్రం మంచిదికాదు. ఈ విషయంలో మంత్రిగారు వెంటనే పూనుకుని బళ్ళారిని మన ప్రాంతంలో కలిపే లాగున ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

ఇదివరలో నేను చదువుతున్న టైములో కోరాపుట్టి, పర్లాకిమిడి, గంజాంజిల్లాలో బరంపురంకూడా మనరాష్ట్రములోనే ఉన్నవని పుస్తకాలలో మేము చూచాము. అవి

Sri M. Pothu Raju] [5th April 1956

కూడా తొలగిపోవడం చాలా కష్టతరంగా వున్నది. తరువాత యిప్పుడు మన రాష్ట్రానికి ఆంధ్ర ప్రదేశ్ లేక విశాలాంధ్ర అని పేరు పెట్టడం గురించి మన సభ్యులందరూ ఆలోచిస్తున్నారు. మొట్టమొదటి నుంచి విశాలాంధ్ర పేరుకోసే విశాలాంధ్ర మనం రాబట్టుకోవడం జరిగింది కాబట్టి విశాలాంధ్రలో చాలా మంచి అర్థం ఉన్నట్లే నాకు తట్టుతున్నది. ఎట్లన విశాలాంధ్ర అంటే ఆంధ్రులు ఎక్కడెక్కడవున్నా, వారందరినీ చేర్చుకోవడానికి విశాలమైన ఆంధ్ర అని చెప్పి ఒక మాట అనుకోడానికి చాలా అవకాశం ఉన్నది. విశాల హృదయంతో ఉన్న ఆంధ్రులు అనుకోవడానికి కూడా చాలా అవకాశం కనపడుతున్నది. కాబట్టి విశాలాంధ్ర అనడము చాలా మంచిదని నేను మనవిచేస్తున్నాను. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ అంటున్నారు. ప్రదేశ్ అనునది మంచి పదము కాదేమోనని అనుకుంటున్నాను. అయినా ముఖ్యమంత్రి గారు ప్రవేశపెట్టినదానినిగురించి ఆమోదిస్తున్నాను. తరువాత మన ఆంధ్రులలో చాలమందికి ఇంటిపేర్లు చెట్టుపేర్లు గ్రామాల పేర్లు కలిగి వున్నవి. కొందరికి గోత్రాలుగూడా, మహాఋషులపేర్లుకూడా కలిగియున్నవి గోత్రాలపేర్లు ఋషులపేర్లు చెట్టుపేర్లు ఇంటిపేర్లు పెట్టుకోవడం మన ఆంధ్రులయొక్క విధానమే. కాబట్టి మన రాష్ట్రానికికూడా అటువంటిపేర్లు పెట్టుకుంటే బాగుండునేమోనని నేను సూచిస్తున్నాను. అవి తమరుకూడా ఆలోచించమని ప్రార్థిస్తున్నాను. ఇప్పుడు మనకు స్వాతంత్ర్యం తీసుకువచ్చిన మహాత్మాగాంధిగారి స్మారకార్థం మహాత్మా ఆంధ్రరాష్ట్రం అనడానికి అవకాశం వుంటుందేమోనని ఆలోచిస్తున్నాను. రెండోది మన రాష్ట్రంగురించి శ్రీ పొట్టి శ్రీరాములు గారు తన ప్రాణాలనర్పించారు కాబట్టి "శ్రీరామరాష్ట్రం" అనడానికి అవకాశం ఉంటుందని మనవి చేస్తున్నాను. రెండోది మన ఆంధ్రులకు శ్రీశైలం అనేటటువంటి దేవాలయం వున్నది. కనుక శ్రీశైలాంధ్ర అని చెప్పడానికి అవకాశంవున్నది. అలాగే బౌద్ధ ఆంధ్ర అనవచ్చు, వసిష్ట ఆంధ్ర, అరుంధతీ ఆంధ్ర అనవచ్చు, వాల్మీకి ఆంధ్ర అన వచ్చు, లేకపోతే గోదావరి మహానది, గౌతమి అని ఉన్నవి కనుక గౌతమాంధ్ర అనవచ్చు. కాబట్టి ప్రభుత్వం ఏదో ఒక అనుకూలమైన పేరు యోచించి నూతనరాష్ట్రానికి పేరుపెట్టడం చాలా ఉత్తమం అనిన్ని ముఖ్యమంత్రిగారు చెప్పినటువంటి పేరు పెట్టడంకూడా సమ్మతమేనని చెప్పి నేను విరమిస్తున్నాను.

Sri N. RAMULU :—అధ్యక్షా, ఆంధ్రులు చిరకాలం వాంఛిస్తున్న విశాలాంధ్ర త్వరలో ఏర్పడుతున్నది. అందుకు సంబంధించిన States Reorganization Bill గత 4 రోజులనుంచి మనం చర్చించడం సంతోషకరం. ఏదో కొన్ని కారణాలవల్లనో పరిస్థితులవల్లనో విధిలేక వేరుపడిన అన్నదమ్ములు యీనాడు

5th April 1956] [Sri N. Ramulu

సుహృద్భావంతో ఒక కుటుంబంగా రూపొందనున్న ఈ పరిస్థితే యీ నాడు ఆంధ్ర తెలంగాణా ఏకీకరణ. ఈ ఏకీకరణకు మూల ప్రాతిపదిక ఆనాడు All India Congress Committee వారు చేసిన భాషాప్రయుక్తరాష్ట్ర సిద్ధాంతమే. ఈ సిద్ధాంతాన్ని ముందుగా అమలుజరిపి ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పరచుకొని దేశానికి అంతా మార్గదర్శకులు కావాలని పట్టుదల ఉత్సాహం ఆంధ్రులది. ఈ పట్టుదల ఉత్సాహంతోనే గత 40 సంవత్సరాలుగా ఆంధ్రులందరూ ఒకే ప్రాంతము, పరిపాలన క్రిందికి రావాలంటే ముందుగా మద్రాసు ఆంధ్రప్రాంతములు వేరుపడి ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేసుకోవాలని గత 40 సంవత్సరాలనుంచి స్థాపించుకున్న ఉద్యమం అమరజీవి శ్రీపొట్టి శ్రీరాములు ఆత్మబలిదానంవల్ల ఫలించింది. మనకు రాష్ట్రం ఏర్పడి 3 సంవత్సరాలు కాబోతున్నది. -2 జిల్లాలతో ఏర్పడిన యీ ఆంధ్రరాష్ట్రం కొలది రోజులలోనే 30 జిల్లాలతో విశాలాంధ్ర లేకపోతే ఆంధ్ర ప్రదేశ్‌గాగాని మారబోతున్నది. ఫజులాలీ కమీషనువారు వారియొక్క report లో ప్రత్యేక తెలంగాణా 5 సం॥ల వరకు వుండాలని చెప్పినప్పటికీకూడా మన High Power Commission పండిట్ జవహర్లాల్ నెహ్రూ మొదలైనవారు యీఆంధ్ర ప్రాంతం అంతా ఒకే పరిపాలనక్రింద జరగాలనే దృష్టితో మన తెలంగాణా సోదరులను సమాధానపరచి యీనాడు ఆంధ్ర తెలంగాణారాష్ట్రాన్ని ఏర్పాటు చేస్తున్నారు. దీనికి ముఖ్యంగా మన ముఖ్యమంత్రిగారు, ఉపముఖ్యమంత్రిగారు, ఆంధ్ర కాంగ్రెసుసంఘ అధ్యక్షులుకూడా చాలా కృషిచేశారు. వారికి నాధన్యవాదాలు. అయితే యీనాడు ఏర్పడిన ఆంధ్రరాష్ట్రం సమగ్ర స్వరూపంఅయిన రాష్ట్రం కాదని నేను మనవిచేస్తున్నాను. ఎందుకంటే మన ఆంధ్రులు యీ 20 జిల్లాలలో నేకాకుండా తతిమ్మా ఒరిస్సా రాష్ట్రంలోనూ ఇంకా మైసూరు రాష్ట్రములోను అనేక ఇతర ప్రాంతములలో ఉంటున్నారు. అయితే మన ముఖ్యమంత్రిగారు మొన్న ఒక మాట సెలవిచ్చారు. మనం ఆంధ్రులమని ఒక గీతగీసుకుని కూర్చుని తతిమ్మా రాష్ట్రాలలో జరిగిన వైజ్ఞానిక, విద్యా, అభివృద్ధిలోగాని, ఆర్థిక అభివృద్ధిలోగాని పాల్గొనకుండా కూర్చునే దృష్టి మన ఆంధ్రులకు లేదని వారు సెలవిచ్చారు. అటువంటి దృష్టి మనకుంటే ఏనాడో 1935 వ సంవత్సరంలో ఒరిస్సారాష్ట్రం ఏర్పరచుకున్న నాడే మనకు ఆంధ్రరాష్ట్రం ఏర్పడేది. కాని అటువంటి ఉద్దేశాలుగాని, భావాలుగాని మనకులేవు. అదీకాకుండా యీనాడు ఒరిస్సాలో జరిగిన అల్లరులు జ్ఞప్తికి తెచ్చుకుంటే వాళ్లకు రావలసిన ప్రాంతములయిన పర్లాకి లాడెంకనాలగురించి వాళ్ల రాష్ట్రంలో చేసిన అత్యాచారాలను మనకు రావలసిన ఒరిస్సా రాష్ట్రంలోఉన్న ఆంధ్రప్రాంతాలు గురించి మనం చేయలేదు. అది మనకు

నిదర్శనం. అయితే మనకుమాత్రం ఒరిస్సా ప్రాంతంలో ఉండే ఆంధ్రప్రాంతం గాని యిటు మైసూరు ప్రాంతంలో బళ్లారిగాని రావని మనం యీనాడు అనుకో కూడదు. ఏ ఒక్క విశాలాంధ్ర దృష్టితో ఏఒక్క ప్రాతిపదికతో తెలంగాణా ప్రత్యేకంగా 5 సంవత్సరాలు రాష్ట్రంలో ఉండకూడదనే భావన మన అగ్రనాయకులకు ఏవిధంగా వచ్చినదో అటువంటి భావన అటువంటి ఉద్దేశ్యం మన అగ్రనాయకులుకూడా ఉన్నది. దానికి కార్యరూపంలో సాధించుకోవలసిన బాధ్యత మన ముఖ్యమంత్రిగారి మీద రాష్ట్ర కాంగ్రెసు వారిమీదఉన్నది. కాబట్టి యీనాడు మనకు యీ ఒరిస్సా ప్రాంతములో ఉన్నట్టి పర్లాకిమిడి, గుణుపురం బరంపురం తాలూకాలు, మైసూరులో బళ్ళారికూడా తప్పనిసరిగా ఆంధ్ర ప్రాంతంలో చేరాలి. వీటిని చేర్చాలంటే ఏదో ఆంధ్రులున్నారనే పరిస్థితినిబట్టి కాదు. పరిపాలనా సౌలభ్యందృష్ట్యాగాని జనాభా నిష్పత్తినిబట్టిగాని లేకపోతే మరొక కారణమునుబట్టిగాని తమకు చేరువలో ఉన్నాయి. వీటిని మనలో చేర్చుకోవలసిన అవసరం మనకున్నది. చేర్పించవలసిన అవసరం అటు ఒరిస్సా ప్రభుత్వానికిగాని, మైసూరు ప్రభుత్వానికిగాని ఉన్నది. కాబట్టి మన ముఖ్యమంత్రిగారు యీ సరిహద్దుల నిర్ణయంగురించి ప్రత్యేకంగా All India ప్రభుత్వం వారు ఒక Boundary committee వేసి దానిని తేల్చవలసి ఉన్నదని నచ్చచెప్పి వ్యవహారం చేయించాలని నేను కోరుతున్నాను. ముఖ్యంగా పర్లాకిమిడిని గురించి సంగతులు చెప్పాలంటే గతసంవత్సరం ఫజులాలీ కమీషను వారు ఒరిస్సా ప్రాంతంలోని పర్లాకిమిడి పర్యటనచేస్తారనే సందర్భంలో ఒరిస్సాప్రాంతం ఆంధ్రులు తమయొక్క ఉద్దేశ్యాలను బహిరంగంగా వెల్లడి చేయకుండా ఉండాలనే ఉద్దేశ్యంతో గత సంవత్సరం జరిగిన అల్లరులు చెప్పడానికి అలవికానటువంటివి.

పర్లాకిమిడిలో ఉండే ఆంధ్రులు పర్లాకిమిడిని వదలిపెట్టి పొరుగునఉన్న ఆంధ్ర ప్రాంతాలకు తరలి రావలసి వచ్చింది. ఇటువంటి పరిస్థితులు ఆనాడు ఉండినవి. ఆంధ్రులు వారి కష్టసుఖాలను తెలుపుకోడానికికూడా ఆస్కారం కనబడటంలేదు. భాషాప్రయుక్తముగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది కాబట్టి తమనుకూడా ఆంధ్ర రాష్ట్రంలో చేర్చుకోవాలని కోరుతున్నారు. వారి న్యాయమనుయిన కోర్కెను గమనించి మన ప్రభుత్వం ఆలిండియా ప్రభుత్వానికి ఈ విషయాన్ని నచ్చచెప్పి పర్లాకిమిడి ప్రాంతాలను మన రాష్ట్రానికి సాధించాలని కోరుతున్నాను. పర్లాకిమిడి ప్రాంతంలో జరిగిన ప్రమాదాలను గురించి నేను చెప్పడంకన్న ప్రభుత్వం వారే తెలుసుకుంటే బాగుంటుంది మన ముఖ్యమంత్రిగారు ఈ నెలలో శ్రీకాకుళం జిల్లాలో పర్యటించబోతున్నారు. ఈ పర్యటనలో వారు పాత పట్టణం వేడు

తున్నారు. పాత పట్టణానికి దగ్గరగా ఉన్న పర్లాకిమిడి వాస్తవ్యులు వారి కష్ట సుఖాలను మన ముఖ్యమంత్రిగారికి అప్పుడు స్వయంగా నివేదించుకుంటారు. వాటి నన్నింటిని ముఖ్యమంత్రిగారు విని తగినంత కృషిచేసి పర్లాకిమిడి ప్రాంతాన్ని ఆంధ్రరాష్ట్రంలో చేరునట్లు చేయవలెనని కోరుతున్నాను. అదేవిధంగా బళ్ళారిని కూడ మన రాష్ట్రంలో చేర్పించే ఏర్పాట్లు చేయవలసిందని మనవి చేస్తున్నాను.

హైకోర్టు అన్నది రాష్ట్రప్రధాన నగరమయిన రాజధానిలో ఉండాలి. అదే హైదరాబాదు. రాజధాని హైదరాబాదులోనే ఉంటుంది కాబట్టి హైకోర్టు కూడ అక్కడే ఉండడం మంచిది. మనమందరము హైదరాబాదుకు పోయి దానిని ఆంధ్రాబాదుగా చేయపోతున్నాము. కాబట్టి హైకోర్టుకూడా అక్కడనే ఉండడం మంచిదని నేను భావిస్తున్నాను.

ఇక జోనల్ కౌన్సిలు విషయం మనవిచేస్తాను. జోనల్ కౌన్సిల్సు ఉండడం వల్ల ఆయారాష్ట్రాల ముఖ్యమంత్రులు పరస్పరము సంప్రదించుకొని కావలసిన సౌకర్యములు చేకూర్చగలరని నేను నమ్ముతున్నాను. వంశధార ప్రాజెక్టు నిర్మాణ విషయంలో ఒరిస్సా ప్రభుత్వంతో చర్చించినామే కాని ఇంతవరకు దానిని సాధించలేకపోయినాము జోనల్ కౌన్సిల్సు ఉన్నప్పుడు ఇటువంటి అంత రాష్ట్రీయ సమస్యలను సాకల్యంగా చర్చించి ఏరాష్ట్రానికి అన్యాయము జరుగకుండా సమరసభావంతో ఎవరికి కావలసిన సదుపాయములను వారు చేసుకోవడానికి అవకాశం ఉంటుంది కాబట్టి ఈ జోనల్ కౌన్సిల్సు తప్పని సరిగా ఉండాలని నేను అభిప్రాయ పడుతున్నాను.

ఆంధ్రులతో చేరినట్లయితే తెలంగాణా అభివృద్ధి కుంటుపడిపోతుందేమో ననే అభిప్రాయం తెలంగాణా వారిలో ఏర్పడి ఉన్నది. మీ అభివృద్ధికి ఎటువంటి ఆటంకము పెట్టము అని హామీ యిస్తామంటే వారు నమ్మకపోతున్నారు. ఇటువంటి పరిస్థితులలో వారి కోర్కెలకు చట్టబద్ధమయిన హామీ ఇచ్చుటకు మనము ఎందుకు అంగీకరించకూడదు ? వారికి కావలసిన అభివృద్ధిని సాధించు కొనుటకుగాను రీజియల్ కమిటీలను ఏర్పాటు చేసుకోడానికి మనకు ఎటువంటి అభ్యంతరము ఉండకూడదు. కాని, మనకు మాత్రము రీజియల్ కమిటీ అనవసరం.

ఇక రీజియల్ కమిటీలనుగురించి మనవి చేస్తాను. ఇప్పుడు మధ్యప్రదేశ్ వంటి కొన్ని రాష్ట్రాలకు లెజిస్లేటివ్ కన్సిల్సు ఉన్నాయి. దేశంలోను 15 రాష్ట్రాలలో జనాభానుబట్టి మహారాష్ట్రం మూడవ రాష్ట్రం కాబట్టి మనకుకూడ లెజిస్లేటివ్ కౌన్సిలుండడం అవసరమని తోచి సభ్యులు చాలామంది

Sri N. Ramulu] [5th April 1956

చెప్పారు చాలామంది మేధావులు ఎన్నికలలో నిలబడి గ్రామగ్రామాలు తిరగడానికి ఇష్టపడరు కాబట్టి అటువంటివారిని శాసనసభలలోనికి తీసుకుని రావడానికి వీలుంటుంది కాబట్టి లెజిస్లేటివ్ కౌన్సిలు మన కవసరమని నేను భావిస్తున్నాను. మన రాష్ట్రముయొక్క పేరుకు సంబంధించి ఒక అంగీకారానికి వచ్చినట్లు మన ముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు. అది ఆంధ్రప్రదేశ్ అనికూడ వారన్నారు. ఆంధ్రప్రదేశ్ అనే ఉండవలెనని నేను అభిప్రాయపడుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

MR. SPEAKER :—The House will now adjourn and meet to morrow at 8-30 a.m.

The House then adjourned.

APPENDIX.

(*Vide* answer to items (a) to (d) of Starred Question No. 858) at page 485 supra.

(a)

| Name of the taluk. | | Number of wells constructed in. 1953-54 | 1954-55. |
|---|---|---|---|
| Ichapuram | ... | 1 | ... |
| Sompeta | ... | 6 | ... |
| Tekkali | ... | 3 | 6 |
| Pathapatnam | .. | 9 | 19 |
| Narasannapeta | ... | 1 | 2 |
| Srikakulam | ... | 3 | 2 |
| Cheepurapalli | ... | 7 | 1 |
| Palakonda | ... | 1 | ... |
| Parvatipur | ... | 1 | 1 |
| Bobbili | ... | 2 | ... |
| Salur | ... | 1 | ... |
| Total | ... | 35 | 31 |

(b)

| Name of the taluk. | | Number of wells proposed. |
|---|---|---|
| Ichapur | ... | 16 |
| Sompeta | ... | 46 |
| Tekkali | .. | 63 |
| Pathapatnam | ... | 107 |
| Narasannapeta | ... | 54 |
| Srikakulam | .. | 53 |
| Cheepurupalli | ... | 84 |
| Palakonda | ... | 18 |
| Parvatipur | ... | 15 |
| Bobbili | ... | 16 |
| Salur | ... | 9 |
| Total | ... | 481 |

(c)

| Year. | | Amount Allotted. | | |
|---|---|---|---|---|
| | | Rs. | A. | P. |
| 1953–54 | ... | 59,997 | 13 | 0 |
| 1954–55 | ... | 30,838 | 0 | 0 |
| 1955–56 | ... | 60,900 | 0 | 0 |

(d)

| Year. | | Amount Spent. | | |
|---|---|---|---|---|
| | | Rs. | A. | P. |
| 1953–54 | ... | 59,997 | 13 | 0 |
| 1954-55 | ... | 30,938 | 0 | 0 |
| 1955–56 | ... | 31,154 | 0 | 0 |